విజ్ఞానవల్లరీ గ్రంథమాల, ప్రథమపుష్పము.

# మాళవికా నాటకము.



గ్రంథకర్త:-

విద్వాన్:- ములుగు చంద్రమౌళి శాస్త్రి.

శ్రీనివాసాత్మనేనమః.

# మాళవికానాటకము.




గ్రంథకర్త:

విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రి.



ప్రకాశకులు:

కాకుమాను వేంకటశివయ్యగారు.

ప్రొప్రయిటరు,

విజ్ఞానవల్లరీ గ్రంథమాల,

కొత్తపేట, గుంటూరు.

మొదటికూర్పు 1000 ప్రతులు.

[illegible] ముద్రాక్షరశాల, తెనాలి.





చందాదారులకు 0—12—0

1924

వెల. రు. 1—2—0

# విన్నపము.

ఈగ్రంథమండలికిఁ బ్రథమపుష్పముగఁ సుమమాళవికా నాటకమును బురూరవ (జయప్రద) నాటకమును ద్వితీయ పుష్పముగను నొసగుటయేకాక మఱియుఁ గావలసిన గ్రంథములిచ్చుటకు సిద్ధముగా నున్న బ్ర॥ విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. రెండవ పుష్పము పురూరవ (జయప్రద) ఇది విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారిచే వ్రాయఁబడినది. వీణాధర ములుగు శివానందశాస్త్రిగారిచే వ్రాయంబడిన చక్కని హిందూస్థానీమట్లుతో నలంకరింపఁ బడినది. కొన్ని కారణములవలనఁ బ్రథమ పుష్పము సకాలమున పంపుటకు వలనపడనందుల కెంతయు జింతిల్లుచున్నాఁడను. రెండవ పుష్పము జూలై చివరకు ప్రకటింపబడును.

ప్రకాశకులు.

# నియమోద్దేశములు.

1. ఆంధ్రదేశమున కుపకరించు బహువిధగ్రంథముల రెండేసి మాసముల కొక్కటిగ ప్రచురించుట.

2. ఆంధ్రకవులను ప్రోత్సహించి గ్రంథముల వ్రాయించుట.

3. తక్కువ వెలలకెక్కువ చక్కని గ్రంథముల నెల్లరకు లభింపచేయుట.

4. శక్తికొలంది నాంధ్రభాషాభివృద్ధికి దోడ్పడుట.

## చందాపద్ధతి.

1. ఈగ్రంథమాలలో చందాదారులుగా జేరువారు ప్రవేశరుసుము క్రింద రు 0—4—0 ముందుగా గ్రంథమాలాధికారికి గాని, తద్గ్రంథమాల ఏజంట్లకుగాని చెల్లింపవలయును.

2. ఇందు రెండేసి నెలలకొక్కసారి ప్రచురించిన పుస్తకము వి. పి. గా పంపబడి చందాదారులవలన సొమ్మువసూలు చేయబడును.

3. చందాదారులకు పంపు గ్రంథము నెప్పుడును రు. 1-0-0 వెలకు మించియుండదు.

4. గ్రంథములు పంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చులన్నియు చందాదారులే భరింపవలయును.

5. ప్రతిపుస్తకమును దప్పక తీసుకొనువారే చందాదారులుగా నెన్నబడుదురు.

6. ఇందు ప్రకటింపబడు ననుబంధములు చందాదారులు కోరిన పంపబడును.

# విజ్ఞానవల్లరీ గ్రంథమాల.

## కొత్తపేట, గుంటూరు.



చందా వివరము.

| | | |
|---|---|---|
| 1. | రాజపోషకులు ... ... ... ... | రు. 25—0—0 |
| 2. | ప్రధానపోషకులు ... ... ... ... | ,, 20—0—0 |
| 3. | పోషకులు ... ... ... ... | ,, 15—0—0 |
| 4. | సహాయులు ... ... ... ... | ,, 10—0—0 |

ఈపైనుదహరించిన 1, 2, 3, 4. నెంబర్లవారి నామములను, ప్రతిగ్రంథములయందు ప్రచురింపజేయుచు వారికి గ్రంథములను పోస్టేజితో సహా యుచితముగా పంపబడును.

N. B. పైనుదహరించినవారు ఒకేపర్యాయము గాని లేక రెండుపర్యాయములుగా డబ్బును గ్రంథమాలాధికారికి చెల్లించిరశీదును పొందవలయును.

ఇట్లు,

కాకుమాను వెంకటశివయ్య,

గ్రంథమాల పబ్లిషర్, & ప్రొపయిటరు.

గుంటూరు.

—* రాజపోషకులు. *—

1. మ. రా. శ్రీ గుండు సూర్య అనంతహరిశాస్త్రిగారు, ప్లీడరు, గుంటూరు.
2. ,, ఘంటసాల పరబ్రహ్మంగారు, సబురిజిస్ట్రారాఫీసు క్లర్కు, [చింతలపూడి.
3. ,, కాకుమాను వీరేశలింగంగారు, తెనాలి.
4. ,, గానాల రామమూర్తిగారు, రాజమండ్రి.
5. ,, చట్టి దుర్గాప్రసాదరావుగారు, మేనేజరు దేశాభిమాని ప్రెస్. [గుంటూరు.
6. ,, కరణం శ్రీనివాసశిరోమణిగారు, గుంటూరు.
7. ,, గరికిపాటి శేతుమాధవరావుగారు, గుంటూరు. [వెల్లలూరు,
8. ,, చిల్లర వెంకటేశ్వర కవిగారు, అష్టావధాని, స్కూల్ టీచరు,
9. ,, త్యాడి వేంకటశాస్త్రిగారు, అష్టావధాని, కాకినాడ.

## —* ప్రధానపోషకులు. *—

1. మ. రా. శ్రీ బొండాడ చిననరశింహంగారు, రాజమండ్రి.
2. ,, అత్తలూరి వీరభద్రాచారిగారు, టీచరు, గుంటూరు.
3. ,, గోనుగుంట నాగభూషణంగారు, బి. ఎ. గుంటూరు.
4. ,, అబ్బాబత్తుల వెంకటసూర్యనారాయణరావునాయుడుగారు ప్రొప్రయిటరు, శ్రీకృష్ణవిలాససభ, బెజవాడ.
5. ,, సింహాద్రి అప్పారావుగారు, క్లార్కు, సబ్ కోర్టు, బెజవాడ.
6. ,, నాసిలి వీరరాఘవయ్యగారు, చేబ్రోలు.
7. ,, మేళ్ళచెరువు వెంకటేశ్వర్లుగారు, క్లార్కు, సబ్ కోర్టు,
8. ,, కొప్పరపు సుబ్బారావుగారు, గుంటూరు. [గుంటూరు.
9. ,, మల్లాది లక్ష్మినారాయణశాస్త్రిగారు, తెనాలి.
10. ,, బద్దిరెడ్డి కోటేశ్వరరావుగారు, బెజవాడ.

## —* పోషకులు. *—

1. మ. రా. శ్రీ అఘరాపురపు రామకృష్ణారావుగారు, స్కూల్ టీచరు, గుంటూరు.
2. ,, పేడింబి శేషగిరిరావుగారు, మ్యునిసిపల్ కౌన్సిలర్, గుంటూరు.
3. ,, గొట్టిపాటి వెంకటరత్నంగారు, గుంటూరు.

## —♦ సహాయులు ♦—

1 మల్లాది ఆదినారాయణగారు నేషనల్ స్కూల్ టీచర్ గుంటూరు

5 దివాకరని రామయ్యగారు గరల్ స్కూల్ టీచర్ ,,

6 వంకమామిడి విజయ్యగారు స్కూల్ టీచర్ ,,

7 మోతడక కృష్ణయ్య పంతులుగారు ,, గుంటూరు

8 గొడ్డపాటి ఆనందరావుగారు బెజవాడ

9 అనుపుకొండ సూర్యనారాయణగారు ప్రొసెన్ మెన్ వాణీప్రెస్ ,,

10 డి. వీరరాఘవస్వామి టీచర్ మ్యునిసిపల్ స్కూల్ ,,

11 పెద్దిబొట్ల వెంకటప్పయ్యగారు నోసపాడు

శ్రీ

# ఉపోద్ఘాతము.

పండిత మండలి కొక విన్నపము.

అనేకులగు మహాపండితులచే దెనిగింపబడి వన్నెకెక్కిన మహాకవి కాళిదాస విరచితమగు మాళవికాగ్నిమిత్రమును నావంటి యల్పజ్ఞుఁడు వ్రాయఁబూనుట హాస్యాస్పదమని తెలిసినను "కాంతా సమ్మితతయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా కర్తవ్యే కుతుకీ బుధో విరచితస్తస్మై స్పృహాం కుర్మహే," "నాటకాంతం కవిత్వం" "కావ్యేషు నాటకం రమ్యం" అను నార్యోక్తులఁ దలఁచినపు డెల్ల నాటకమే దేని వ్రాయుమని నా యంతరాత్మ నాకుత్సాహముగలిగించు చుండెడిది. నాకు మొదటనుండియు మహాకవిగ్రంథముల యాదర ముతోఁ జదువుట యలవాటగుటవలనఁ దొలుదొల్త నాతని నాటకమే తెనిగింపమనసుగలిగి మాళవికాగ్నిమిత్రమును "మాళవిక" అను పేరుతో వ్రాయుటకు నిశ్చయించితిని. ప్రస్తావనముగించి రంగములోనికి దిగు నెడ నామిత్రులు కొందరు <u>ప్రస్తుతనాటకసమాజముల కనుకూలమగు</u> నటుల మీరు స్వాతంత్ర్యముగూడ నవలంబింపుఁడని హితోపదేశము చేయుకతన మహాకవి నిర్దిష్టములగుఁ గొన్ని పాత్రములఁ దగ్గించి యక్కడక్కడ గొంతవిషయము పెంచి కొంతకథను మార్చి మూల శ్లోకములఁ బరివర్తనము జేయు నెడ స్వకపోలకల్పనము జేర్చి నటకులకుఁ బ్రయోగింపకష్టమని తోచినచోట నచ్చటచ్చట భావమునకుఁగూడ విపరిణామము గావించితిని. మొత్తముమీఁద కాళిదాసకవి కథకును భావమునకును వికారము గల్గింపక పూరించితిని. ఇందేవిధమైన నెరసులున్న నుండవచ్చును వానినిసవరించుకొనుభావము పాఠకులందిడి నందులకు నాపై గినియకుందురుగాత. "జగమెఱింగిన బ్రాహ్మణునకు జందెమేల" యనునట్లు మహాకవులచే బొగడఁబడిన మాళవికాగ్నిమిత్ర మునుగూర్చి విశేషముగ వ్రాయుట పిష్టపేషణమని విరమించితిని. ఉదయద్యావనయైన మాళవిక యెట్టివడకగలిగినను సంభావనార్హ యేగదాయని నాధైర్యము.

ఇట్లు

గ్రంథకర్త.

శ్రీః

మీనాక్ష్యైనమః

# ఇష్టదేవతాప్రశంసనాదికము.

చ॥ శ్రితజనరక్షణాభిరతిఁ జేసి నిరంతరవాసమైన ప
ర్వతమున నున్కి వీడి మధురాపురమున్ శ్వాశుగాలయంబుగా
సతము వసించి మాదృశుల సన్నుతిఁ గైకొను సుందరేశుఁ డీ
కృతికినుఁడై కుశీలవులకిష్టశుభప్రతిపాదియయ్యెడున్.

మ॥ తపకారుణ్యమె లోకసౌఖ్య ఘటనోద్యత్కారణంబై తగన్
దనసాంగత్యమె సుందరేశ్వరున కత్యంతంబు మోదంబుగాఁ
గను శ్రీమన్మధురాపురంబున జగత్కల్యాణసంధాత్రియై
యనయంబున్ వసియించు భద్రదను మీనాక్షిన్ మదిన్ గొల్చెదన్

చ॥ నిమిసమయోని మమ్ము విడనేరక గన్నులఁ గప్పికొంచు స
క్రమముగు శిక్షచేత సుకరంబగు శాస్త్రము నేర్పరించెఁ బు
ణ్యమతి యతండు మాకుఁ బితనందయసూరివరేణ్యుఁ డస్మదీ
యముగుఁ గవిత్వమెల్ల కడలంను వెలింగెడి నట్లొనర్చుతన్.

ఉ॥ నేరనివాఁడనై చదువునేర్పెడి యొజ్జలసహ్యమొందగా
వారలపేరిలన్ గలసి వాదములాడుచు సంచరించు న
న్నారసి చేరఁదీసి యనయంబు శ్రమంపడి విద్యనేర్పె మా
భైరవమూర్తి సద్గురుఁ డపారకృపాకలితుండుగాఁ నాకో!

తే॥ తనకు శాత్రులయెడఁ గల దయనుజూప
సకల శుభలక్షణాసతంసయగుఁ గవిత
నాకొసంగెను ముదిగొండనాగలింగ
శాస్త్రిగారికి నాసమస్కారశతము.

శా॥ ఏనల్పజ్ఞుఁడనౌట నాకవితయందే దోషముల్ గల్గినన్
వానిన్ బోకడఁబెట్టి యీకృతిరమ యానందంబుతోఁ గన్గొనన్
మీనాక్షి పుణ్యము వేడుకొందు నెవరేనిన్ బీనవక్షోజన
మ్రామానాంగిని గౌరవంబుమెయి నిత్యంబెత్తి ముద్దాడరే.

విద్వాన్
ములుగు చంద్రమౌళిశాస్త్రి,
తెనాలి.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

---

### పురుషులు.

సూత్రధారుఁడు,
పారిపార్శ్వకుఁడు.
అగ్నిమిత్రుఁడు—విదిశాధిపతి. కథానాయకుఁడు.
వాహాతకుఁడు—మంత్రి.
గౌతముఁడు—విదూషకుఁడు.
గణదాసుఁడు }
హరదత్తుఁడు } నాట్యోపాధ్యాయులు.
జయసేనుఁడు—కంచుకి.
సారసకుఁడు
కుబ్జుఁడు—ఉద్యానవనపాలకుఁడు.
వసంతుఁడు—తైధరికుఁడు.

### స్త్రీలు.

ధారిణి—పట్టమహిషి.
ఇరావతి—భట్టిని.
మాళవిక—నాయిక.
పండితకౌశికి—పరివ్రాజిక.
వకుళావళిక—మాళవిక చెలి.
కౌముదిక—చేటిక.



శ్రీ మధురమీనాక్ష్యై నమః.

# మా ళ వి కా నా ట క ము.



## ప్రథమాంకము.

### నాంది

చ॥ శ్రితఫలదేశ్వరత్వమునఁ, జేరియుఁ గృత్తిఁ గటిన్ ఘటించి సం
తత లలనార్ధగాత్రుఁడయినన్ విషయేతరయోగిగేయుఁడై
కుతలము ద్రచ్చి రూపములఁ గూరిమి నేలుచు నాభిమానియై
సతతము శివుండు మీకు శుభము నారసి తామసవృత్తిఁ గాచుతన్.

(అనంతరము ప్రవేశించి)

సూత్ర-ఆహా! ఏమి నాయదృష్టము పండితప్రకాండమండితంబైన యీ పరిషత్తు కించిజ్ఞుఁడనగు నన్ను పెద్దఁగఁ జేసినది? (తెరవైపుఁ జూచి) ఏల నీయతివిస్తరము. మారిషా! ఇటురమ్ము.

పారిపార్శ్వకుఁడు-భావా! ఇదిగో వచ్చితిని.

సూత్ర—ఓయీ! తొల్లి గీర్వాణభాషయందుఁ గాళిదాస మహాకవిచే మాళవికాగ్నిమిత్రమను రచియింపఁబడి ప్రస్తుతము సహృదయ హృదయాహ్లాదకరమగునటుల ములుగు చంద్రమౌళీశ్వరునిచేఁ దెనిగింపఁబడిన "మాళవిక" అను రూపక మీ వసంతోత్సవమునఁ బ్రదర్శింప సామాజికులు నాకాజ్ఞ యిచ్చిరి. కాన నొకపరి యీసభికుల మనంబు లుత్సాహపూరితమగునట్లు సంగీతము నారంభింపుము.

పారి—కాదు కాదు. ప్రథితయశస్కులగు భాసక సౌమిల్లకవి పుత్రాదుల
రూపకముల నాదరింపక నాధునికమగు నీ నాటకము నేల
ప్రదర్శింపవలయును ?

సూత్ర-ఓసీ! వివేకహీన ? ఏమిమాటఁ బలికితివి ?

సీ॥ ధరఁ బురాతనమైన నూతనమునైన
నెల్లకావ్యంబులందున నేదిసగుణ
మును ననింద్యమునగు దానిఁ గొనిభజింతు
రరసి పండితు లవివేకు లటులఁగాదు॥

పారి— ఈవిషయమున సామాజికులే ప్రమాణము.

సూత్ర— కనుక నీవు త్వరఁ జేయుము.

గీ॥ ధారిణీసేవకై పరిచారులఁగతి
మున్ను గసిరంబునకొనఁగొల్చి యున్నయట్టి
పరిషదాజ్ఞనొనర్పంగ భావమందు
దృఢమగు ప్రయత్నమొనరింతుఁ నీవగతిని.
(ఇరువురు నిష్క్రమింతురు. ప్రస్తావన)

[ తరువాత వకుళావళిక ప్రవేశించును ]

సంగీతశాల సమీపము,

వకు—"మాళవిక సూక్ష్మబుద్ధిగలదను విశ్వాసమున నామె కొకరు
ద్వారికడ ఛలికమను నాట్యమును నేర్పించుచుంటిని. ఇప్ప
టికామె కావిద్యయందెట్టి పరిచయము గలిగెనో నాట్యాచా
ర్యుఁడగు గణదాసు నడిగిరమ్మని" దేవి నాకాజ్ఞయిడినదిక దా?
కావున గణదాసును గాంచ సంగీతశాలకే పోయెదను.

(పరిక్రమించును.)

(తరువాత నాభరణహస్తయగు మరియొక చేటి ప్రవేశించును)

వకుళా-(చూచి) ఓసీ! ఎందులకే గర్వము. నన్నుఁజూచియే తొలఁగిపోవు
చున్నావు.

కౌము-(చూచి సంతోషముతో) చెలీ! వకుళావళికా! చాలదినములకుఁ గనుపడితివే? పనులందరచే నిన్నుఁ జూడనైతిని. కోపింపకుము. ఇదిగో నాగముద్ర వేయఁబడిన యుంగరము శిల్పికని నుండి తీసికొని పోవుచుంటిని.

వకు—సఖీ! నిమీఁద నాకుఁ గోపమా! ఎగతాళి కట్లంటిని. నామాట మనసున నుంచుకొనకుము. కాని యీ యంగుళీయక మెవని కై తెచ్చుచుంటివి? దీనిచేత నీచెయ్యి మెఱయుచున్నది సుమీ?

కౌము-ఇది ధారిణీదేవిగారికై తీసుకొని పోవుచుంటిని. నీప్రయాణ మెంతదవ్వు? ఏదో యవసరముగాఁబోవుచున్నట్లున్నావే? రహస్యము కాదుగదా?

వకు—ఓసీ! చతురికా! ఎంత చమత్కారముగాఁ బల్కుచుంటివే? నీకుఁ జెప్పఁదగని రహస్యము నాయెడ నుండునా? మాళవికకెట్టి నేర్పుగలిగెనో గణదాసు నడిగిరమ్మని దేవి యనుప సంగీతశాలకై పోవుచుంటిని.

కౌము-నాట్యకాభ్యాసమందే దృష్టినుంచి యహరహము గురుకులవాస మొనర్చుచున్నదిగదా మాళవిక. రాజుగారామె నెట్లు గాంచఁగలిగిరో?

వకు—ఒకనాఁడు వినోదముగా దేవిగారు క్రొత్తగ రంగువేయఁబడిన చిత్రపటమును జూచుచుండ రాజుగారకస్మాత్తుగ నటకువచ్చి యాపటమును దేవి వెనుకనుండి చూచిరి.

కౌము—చాల ప్రమాదమే! తరువాత

వకు—తరువాత నుచితోపచారములఁగొని యొలిక యాపటము ను దేశించి దేవి నడిగెను.

కౌము-ఏమని?

వకు—దేవీ! “ఈ తరుణిని నే నెన్నఁడును జూచియుండలేదు? ఈ బాలపేరెయ్యది? ఈ పటము నీకెట్లు లభించినది అని”

కౌము-ఆకృతి విశేషమాదరమునకు స్థానముగదా ? తరువాత

వకు—తరువాత దేవి యామాట విననియట్లు వేఱొక ప్రసంగము దీసి కొనిరాఁగా రాజుగారు మరల దానినే యడిగిరి. అప్పుడు సమీపమున నున్న వసులక్ష్మి "అయ్యా! ఈమెపేరు మాళవిక" యని చెప్పినది.

కౌము-శాలభావమున కిది తగినదే. కాని మాళవిక యిప్పుడెక్కడ ?

వకు—దేవి, మాళవికను దాఁచి రాజుగారికంటఁబడనీయక కాపాడు చున్నది.

కౌము-(విచారము నభినయించుచు) పాపమాలేమ కెంత యస్వాతంత్ర్య మేర్పడెను. ఆవులావులుపోరాడి లేఁగలకాళ్ళవిరిగినట్లైనదే ? మాళవికను రాజుగారు చూచిన దేవికేమి కోఁత యగునో ?

వకు—ఆవిషయము మనకనవసరము.

కౌము-చెలీ! మనమువచ్చి పెద్దప్రొద్దైనది. నీపని, జూచుకొనుము. విచారింపఁగా మాళవిక యస్వాతంత్ర్యమువలనఁ గష్టములగలుగునట్లున్నది. (అని నిష్క్రమించును)

వకు—(పరికించి చూచి) ఇదే నాట్యాచార్యుఁడగు గణదాసు సంగీతశాలనుండి వెలుపలకు వచ్చుచున్నాఁడు. నేనాతని కగుపడెదను (అని ముందుకు నడచును)

గణ—(ప్రవేశించి సంగీతశాల) కులవిద్య యందఱకును బహుమానింపఁదగినదే ? మాకీ నాట్యమునుగూర్చి మిథ్యాగౌరవము కాదు ఏలయన ?

మ॥ క్రతుసాక్షాత్కృతి హృద్యచాక్షుషమునై • గన్పట్టునంచున్ మునుల్
క్షితి నీనాట్యముగూర్చి చెప్పునెపుడున్ • శ్రీకంఠుఁడార్యాసతీ
యుతుఁడై రెండుగఁజేసె దీనిజగదు • ద్యోగంబు త్రైగుణ్యసం
గతమిచ్చోట రసంబనేకమగుచున్ • గన్పట్టెడిన్ జూడఁగన్॥

నాట్య మేకరూపమైనను భిన్నరుచిగలజనుల కనేకవిధముల సంతోష మొసఁగుచుండును.

వకు—(సమీపించి) ఆర్యా! నమస్కరించెద.

గణ—భద్రా! చిరకాలము జీవింపుము.

వకు—ఆర్యా! శిష్యయగు మాళవిక యుపదేశగ్రహణమునఁ గ్లేశపడదుగదాయని ధారిణీదేవి నాముఖమున మిమ్మడుగుచున్నది.

గణ—మేధావతియు మిక్కిలి నైపుణ్యముగలదియు నని విశేషించి చెప్పనక్కరలేదని విన్నవించితినని పలుకుము. మఱియు నిట్లని కూడ చెప్పుము.

సీ॥ అభినయంబున భావికం • బగు సంగతులను
దేని నుపదేశ మొసఁగింతుఁ • జెలువ కీను
నావిసంతయుఁ జూపు బ్ర • త్యుత్తమముగను
గలిగి ప్రత్యుపదేశంబు • సలుపుఁబోలె॥

వకు—(స్వగతము) ఇరావతి నతిక్రమించుచున్నట్లున్నదే? (ప్రకాశము) అయ్యా! దేనివలన మీకిట్టి సంతోషము గలుగుచున్నదో? ఆశిష్యజనము ధన్యయని తలంచెద.

గణ—భద్రా! ఆమెనైపుణిమ యన్యదుర్లభమగుటచేత నడుగుచుంటిని? దేవిగారామె నెటనుండి తెచ్చిరో?

వకు—ఆర్యా! వీరసేనుఁడను తోఁబుట్టినవాఁడు దేవిగారికి వర్ణా-వరుఁడు కలఁడు, ప్రభువాతని నర్మదాతీరమందలి గడిదుర్గమున నెల్లరక్షణకై నియోగించెను, అతఁడీమెను శిల్పమునఁ దెలివికలదియని యక్కగారికి నరణముగాఁ బంపినాఁడు.

గణ—(స్వగతము) రూపవైలక్షణ్యమునందలి విశ్వాసమున నీమె నుత్తమకులీనఁగఁ దలంచెదను. (ప్రకాశ) భద్రా! నాకును నీమూలమునఁ బ్రతిష్ఠగలుగఁగలదు.

తే॥ పుడమి మేఘోదకంబున ♦ ముత్యశుక్తి
యందుఁబడిముత్యమైయొప్పు ♦ నట్లుల నున్న
తమగుఁబాత్రంబునొందిన శి ♦ ల్పమువిశేష
గుణముఁగాంచెడిగద శిల్పి ♦ గుణములేక.

వకు——ఆర్యా! తమశిష్యజన మిప్పుడేకృషినున్నది?

గణ——ఇప్పుడే పంచాంగాభినయము నుపదేశించియించుక విశ్రాంతి గాంచుమని యనుప దీర్ఘికావలోకన గవాక్షమునఁ జల్లగాలి ననుభవించుచున్నది.

వకు——చిత్తమునాకనుజ్ఞ నొసఁగుడు. దేవిగారికి తమసంతోషము నెఱింగించి కృతార్థురాలనయ్యెద.

గణ——నేనును భవనముకేగి పనిచూచుకొనియెద. పోదము. (ఇరువురు నిష్క్రమింతురు. (ఇదిమిశ్రవిష్కంభము.)

(తరువాత రాజును లేఖగొని మంత్రియు నేకాంతమున పరిజనమును ప్రవేశింతురు.)

సభాస్థలము.

రాజు——(తనలోఁ లేఖఁజదివిన మంత్రినిగాంచి) అమాత్యా! విదర్భాధిపతి యిప్పుడేమిపొందఁదలఁచుచున్నాఁడు?

మంత్రి——దేవా! ఆత్మవినాశము.

రాజు——ఏదీ? ఆతని నిదేశము.

మంత్రి——దేవ! సావధానముగ విందురుగాక. ఇదే విదర్భాధిపతిప్రత్యుత్తరము. ఓయీ! నీకుఁ బితృవ్యపుత్రుండును గుమారుఁడును నగు మాధవసేనుఁడు మాతోసంబంధము జేయఁగోరి వచ్చుచుండు నెడ మధ్యేమార్గంబున నీ యెల్లకాపరి యాతనిని బట్టుకొనియెను. కళత్రసోదరీయుతముగ మమ్ముగూర్చి యాతనిని

విడుదలఁ జేయుము. అని పూజ్యులరగు మీరాజ్ఞాపించితిరి. ఏకవంశ్యులగువారియందు గలుగు రాజవ్యవహారము మీకెఱుఁగనిదికాదు. కావున మీరీవిషయమున నుదాసీనులై యుండఁ దగుదురు. మఱియు నాతని తోఁబుట్టు వాసంకులమునఁ జెదరిపోయెను. ఆమెను వెదకింప యత్నింతును. మీరు మాధవసేనుని విడిపింపఁగోరుదురేని యీయొడంబడిక వినుఁడు.

క॥ వినుమా శ్యాలకుఁ దగు సచి
వుని బంధవిముక్తుఁ జేసి ♦ పోరిమాధవ సే
నుని విడిపింపఁగొనుంగ
యనఘా! మీకెఱుఁగగాని ♦ యట్టిది కలదే?

(అని చదువును)

రాజు—(రోషముతో) ఏమీ? అనాత్మజ్ఞుఁడగు నాతఁడు పనిమార్పున నాయందు వ్యవహరింపఁ దలఁచుచున్నాఁడు? వాహతకా! ఆతెఁడు నాకుమిక్కిలి ప్రతికూలిగదా? అందువలన నాతని నున్మూలింప సంకల్పించుకొనిన సేనాచక్రమును దరలింపుము.

అమా—చిత్తము. దేవరయాజ్ఞ.

రాజు—ఇందు నీయభిప్రాయమేమి?

అమా—రాజులకును శాస్త్రములకును దగినట్లు సెలవిచ్చితిరి.

తే॥ ప్రజలయందు దృఢముగాని ♦ పదముగలిగి
యచిరకాలంబునకె రాజ్య ♦ మందినట్టి
వైరి క్రొత్తగ నాటిన ♦ వసుమతీరు
హంబుబలె సమూలముగఁదీ ♦ యంగదగును॥

రాజు—అవును సేనాపతికీకార్యము నెఱింగించి సైన్యముతో వెడలు నాజ్ఞ వినుపింపుము.

మంత్రి—చిత్తము. (అని నిష్క్రమించును) పరిజనమొప్పటియట్లు నుండును.

(విదూషకుఁడు ప్రవేశించి)

గౌతమా! మొన్న చిత్రపటమందుండియు నామనంబుహరించి
నాకానందమును గూర్చిన మాళవికను ప్రత్యక్షముగఁజూచునట్లు లేదేని
యొక యుపాయ మాలోచింపుమని మహారాజుగారు నాకానతియొసఁగి
నందున నాబుద్ధికుశలతచే నట్టే కార్యసిద్ధియగుటకొక మంత్రముఁగ
ప్రయోగించివచ్చితిని. దానిని రాజుగారికిఁదెల్పి సంతోషము గలిగిం
చెద- (అని నడచును)

రాజు—(చూచి) ఓహో రహస్యవ్యాపారములందు నాకత్యంత
మిత్రమగు గౌతముఁడిదే వచ్చుచున్నాఁడు- అతని ముఖమున
నొకవిధమగుఁ గళగానవచ్చుచున్నది- కార్యమనుకూలించి
యుండనోపు- (ప్రకాశము) మిత్రమా! రమ్ము-

విదూ—(దరహాసము సల్పుచు) మహారాజా! జయమగుగాక-

రాజు—మిత్రుఁడా! కుశలముగ వచ్చితివా! నీయాలోచన యొక
యుపాయాంతరమున నియోగింపఁబడినదికదా?

విదూ—ఉపాయాంతర ప్రశ్న యేటికి? కార్యసిద్ధినే యడుగుము-

రాజు—ఏమని-

విదూ—(చెవిలో నేదియో చెప్పును)

రాజు—(సంతోషముతో) బాగుమిత్రుడా బాగు లెస్సగా నాలో
చించితివి కష్టసాధ్యమైనను దీనిని నీతెలివివలన సులభసాధ్య
మగునట్లు జేసితివి. నిన్ను మెచ్చుకొనవలెనే ఏలనన?

మ॥ ప్రతిబంధంబుగలట్టి కార్యముల సా ♦ ఫల్యంబుఁ బొందింప సం
గతముగా బాయనితోడు పాటుగల భూ ♦ ధారుండె నేర్చుఁగా సము
న్నత దీర్ఘంబులునైన లోచనములు ♦ న్నఁగా దీపికల్ వీడి గా
ఢతమంబందున దృశ్యవస్తువులఁజూ ♦ డఁగా నేర్చునే యెవ్వఁడున్॥

(తెఱలో) చాలు చాలు- నీవట్టికయ్యముతో నేమిప్రయోజనము- మనయిరువుర తారతమ్యము రాజుగారిసమక్షమునఁ దేలఁగలవు లెమ్ము!

రాజు—మిత్రుఁడా! నీ నీతివృక్షమునకుఁ బూవుపుట్టినట్లున్నదే?

విదూ—అదృష్టముండెనేని ఫలముగూడఁగాంచఁగలవు.

కంచు—(ప్రవేశించి) దేవ! దేవరయాజ్ఞ యథావిధిగ ననుష్ఠింపఁబడినదని యమాత్యులవారు విన్నవించుచున్నారు. మఱియు నాట్యాచార్యులిరువురుఁ బరస్పరము జయముకోరుకొనుచుఁ బ్రత్యక్షముగ శరీరములఁదాల్చిన భావములఁబోలి యేలినవారిని దర్శింపఁ గోరుచున్నారు.

రాజు—సత్వరము ప్రవేశపెట్టుము.

కంచు—(చిత్తము అనినిష్క్రమించి మరల వారితోఁ బ్రవేశించి) అయ్యా! ఇటు ఇటు.

గణ—(రాజును సమీపించి) ఆహా రాజమహిమ తెలియశక్యము గాదుగదా?

తే॥ పాచయుండును శాంతుఁడే ♦ నరవరేణ్యుఁ
డైన సన్నిధికేగ భ ♦ యంబుగల్గుఁ
బ్రతినిమేషంబునకు సము ♦ ద్రంబుఁబోలి
క్రొత్త క్రొత్తగఁగన్పట్టు ♦ కుశలుఁడితఁడు.

హర—ఇది పురుషరూపముదాల్చిన గొప్ప తేజముగదా? కనుకనే

తే॥ ద్వారపాలకు ననుమతిఁ ♦ బడసివచ్చి
కంచుకినిగూడి నడచుచు ♦ నించుకేనిఁ
గనుఁగొనఁగరాని పతిదేహ ♦ కాంతితోడఁ
బలుకులేకయె నెడలింపఁ ♦ బడితినహహా.

కంచు—ఇదే మహారాజుగారు మెల్లగనడువుండు.

ఇరు—(ప్రవేశించి) మహారాజా! జయమగుగాక.

రాజు—(చూచి) ఉపాధ్యాయులారా! వర్ధిల్లుడు (పరిజనమును గాంచి) వీరికుచితాసనములఁజూపుడు (పరిజనమట్లుచేయును.) వారును కూర్చుందురు.

రాజు—ఏమిది? శిష్యులకు బోధించుకాలమున నిరువురుఁదలఁచినట్లు లొక్కసారిగ వచ్చితిరి? కారణమేమి?

ఉపా- దేవరదర్శనముగావించి తడవుకాలమగుటచేత నొక్కసారిమరల దర్శించుఁ దలంపున వచ్చితిమిగాని వేరుగారణమేమియుఁ లేదు.

గౌత—కాదు. మీరువచ్చుటకేదియో గొప్పకారణముండి తీరవల యును. శ్రాద్ధకర్మకుగాక పురోహితుఁడూరక ధర్భఁగొనిచనునా?

రాజు—(స్వగతము) పాపము శమించుగాక (ప్రకాశము) అయ్యా! మీరాగమన కార్యము దెలుపుఁడు. భయముండదు.

గౌత—చల్లకువచ్చి ముంతదాచినఁ బ్రయోజనమేమి?

గణ—దేవ! సావధానులరై వినుఁడు. నేను బూజ్యులగు నాచార్యుల యొద్దచిరకాలము గురుకులవాస మొనర్చి విద్యాభ్యాసము గావించితిని. నాశిష్యోపదేశచాతుర్య మీలోకి మెఱుఁగనిదికాదు గదా? దేవరయు నాయందువాత్సల్యము గలిగియున్నారు. దేవినాకు నాట్యాచార్యపదవి నొసంగెను.

రాజు—ఆవిషయము నేనెఱుఁగుదును. అయిన నేమయ్యెను.

గణ—అట్టి సకలవిధ సంగీతశాస్త్రపారంగతుఁడనగు నన్నీకించిజ్జ్ఞుఁడగు హరదత్తుఁడు గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించినటుల నిందాపూర్వ ముగ నాక్షేపించెను.

గౌత—(నవ్వుచు) నిన్నే యాక్షేపించెగా? ఎంత విపరీతము. ఏమని యాక్షేపించెను.

గణ—ఏమనియా? ప్రధానపురుషుల యెదుట గణదాసుఁడు నాపాద రజోలేశమునకైన జాలఁడని”

హర—(గణదాసు నుద్దేశించి) ఆగుమాగుము కముంగడు నందఱ కన్నుమూయకయె కంటిరెప్పలుగూడఁ దెల్లఁబడిన నీవింకనుగల్ల లాడుట మానకుంటివే? నీయసత్యప్రలాపంబుల నెవ్వరు విశ్వ సింతురని తలంచితివి? దర్శనమాత్రంబున నెల్లరనిజానిజంబుల నవలీలఁగనుగొను సామర్థ్యముగలిగి విష్ణ్వంశ సంభూతుం డగు నీమహారాజునొద్ద యనృతంబులాడు నీనాలుకఁగోసినను పాపమా! ఇంతటి ద్రోహకుఁడవని నేనెన్నఁడుఁ నెఱుఁగ. అట్లైన నో బాగుగ సేయుచుండెడిది. "మగనిఁగొట్టి మొరపెట్టినందురిది మోకాబాలు. (రాజునుద్దేశించి) దేవ! ఈతనికిని నాకును హస్తి మశకములంత తారతమ్యముగలదట. మాయిరువుర గుణము లు మీరెఱుంగనివిగావు. కాన మధ్యస్థులరై మాయుభయుల నభినయమందును శాస్త్రమందును బరీక్షించి గౌరవింతురుగాక—

పరి—సమర్థనమైన ప్రతిసరమే.

గణ—బాగుగానుండేవా! నిశ్చల చిత్తులరై యాలకింపుఁడు.

రాజు—త్వరపడకుఁడు. ఇచటనొకచోనైన దేవి పక్షపాతము వహించి తిమని తలంచును. పండితకౌశికిని చూచుచుండ దేవిసమక్ష మున నైనచో నీకలహము న్యాయముగ నుండును.

విదూ—మంచిమాటలు చెప్పితిరి. గ్రహాచారమున్నాలక గణదాసునొద్ది నచో దేవి కోపింపఁగలదు.

గణ—దేవర యిష్టము.

రాజు—(కంచుకితో) జయసేనా! దేవికీవార్త నెఱింగించి పండితకౌశి కినితోఁగూడ నిటకుఁ బిలిచికొనిరమ్ము!

కంచు—చిత్తము. (అని నిష్క్రమించును)

[ తరువాత ధారిణియుఁ బండితకౌశికియుఁ బ్రవేశింతురు. ]

పండి—నీపక్షమునకు న్యూనత గలుగునని శంకింపకుము గణదాసుండు ప్రతిపక్షికి లొంగువాఁడుకాఁడు.

ధారి—అదియుదార్ధమగును కానిభగవతీ! రాజాశ్రయము హారదత్తు నకుగౌరవదాయకమగు నేమోయని శంకించెదను.

పండి—నీవును రాజ్ఞీవశబ్దము గలదానివేకదా? చూడుము.

తే॥ తరణికరకాండములఁ గొని ♦ దహనుఁడెపుడుఁ
గడుఁబ్రకాశించు, తేజంబుఁ ♦ గాంచుచుండు
నీరజారాతియును యామి ♦ నీగ్రహితుఁ
డగుచు నాహ్లాదకరుఁడగు ♦ నవనికెల్ల॥

విదూ—(చూచి) ఆశ్చర్యర్య మాశ్చర్యము. పండితకౌశికిని ముందుంచుకొని దేవియదిగోవచ్చినది. రాజా! చూడుము.

రాజు—మిత్రుడా! దేవిని చూచుచున్నాను.

తే॥ చెలఁగి యతివేషధైన కౌ ♦ శికనిగూడి
మంగళద్రివ్యములఁ దాల్చి ♦ మగువయాలరె
నవని నాధ్యాత్మికంబు తో ♦ నలరువిగ్ర,
హంబుదాల్చితనర్చు వే ♦ దంబుఁబోలె॥

పండి—దేవ! జయమగుగాక.

రాజు—భగవతీ! నమస్కరించెదను.

పండి—

తే॥ పలువురు నుతింపఁదుల్యాక్ష ♦ మలుసమున్న
తాన్వయంబునఁ బుట్టియు ♦ నలరువారు
ధారిణీదేవికిని భూత ♦ ధారుణీకిని
రమణుఁడవుగమ్ము నీవుశ ♦ రచ్ఛతంబు॥

ధారి—దేవ! నమస్కారము గొనుఁడు.

రాజు—దేవికి శుభమగుదాక. (పండితకౌశికితో) భగవతీ యీ యాసనమలంకరింపుము.

[ అందరును కూర్చుందురు. ]

రాజు—భగవతీ! పరస్పరము జయము గోరుకొను హారదత్తగణ

దాసుల బరీక్షించు విషయమున మీకు స్వాతంత్ర్యమవలం
బింతురని ప్రార్థించుచున్నాఁడ.

పండి—(చిరునగవుతో) పట్టణమునకుఁ బల్లెయాదున నారత్నములఁ
బరీక్షించుట.

రాజు—అట్లుగాదు. ఈ విషయమై నేనును దేవియుఁ బక్షపాతము
వహించినవార మగుదుము.

పండి—(ఆలోచించి) దేవా! నాట్యశాస్త్రము క్రియాప్రధానముగాఁ
గలదిగావున వాగ్వ్యవహారమునఁ బ్రయోజనముండదు. ఇందు
దేవిచిత్త మెట్లుండునో?

ఉషా—బాగుగా నాలోచించి చెప్పితిరి.

ధారి—నన్నడిగెదరేని నాకీవివాదమే రుచింపదు.

గణ—దేవీ! తమ యభిప్రాయము ననుసరించిన లోకులు నాయం
దసామర్థ్యము నూహింతురు.

గౌత—స్వోదరభరణమాత్రప్రియులగు వీరి కలహము గన్న నాకుఁగడు
పుబ్బునట్లు నవ్వు వచ్చుచున్నది.

ధారి—(గౌతముని జూచి) నీవు నిక్కముగఁ గలహప్రియుఁడవయ్యా!
నీమాటలు చూడ నారదుఁ బంపిపుట్టితివని తలంపకపోరు.

గౌత—అమ్మా! కోపింపకుము. మదపుటేనుగులలో నేదియో యొకటి
మోడినఁగదా పోరాటము తగ్గును.

రాజు—వీరి జయాకాంక్ష రూపమువలననే తెలియుచున్నది.

పండి— అవును.

రాజు— పరస్పరగర్వనిర్వాపణాభిరతులగు వీరిరువురకుఁ బరీక్షవలనఁ
గాని క్రోధోపశాంతి గలుగదు. కావున నిందు ప్రథమ
పూజ్యుల నిర్దేశించుభారము పండితకౌశికిని పై యున్నది.

పరి— మహారాజుగారి నియమ మనతిక్రమణీయముగదా? దేవ!

చ॥ సరసులు మెచ్చునట్టులుగ • శాస్త్రము నధ్యయనం బొనర్చినన్
స్థిరమతి బోధ సేయుటకు • దేశికుఁడొక్కఁడు నేరకుండు నో

కృతుఁ డుపదేశముఁ జెలుప ♦ గా ఘనుఁడయ్యు బఠింపకుండు న
య్యరుగతులన్ జెలంగునతఁ ♦ డేతగు మున్నుగ గౌరవింపఁగన్.

గౌత- వింటిరిగదా? మీరు ఫలితార్థము మీయుపదేశముఁగాంచి తీర్పుజేస్తురఁట.

పరి- అదిగో మాళవిక.

గణ- ఫలినవారి చిత్తము.

ధారి- భగవతీ! ఒకవేళ శిష్యుఁడు మందబుద్ధిగలిగి గురూపదేశము గ్రహింపనేరకున్న నదియు నుపాధ్యాయుని దోషమగునా?

పండి—అవును, చంచలచిత్తుఁడగు శిష్యుని పరిగ్రహించుట యుపాధ్యాయుని దోషమే.

ధారి—(స్వగతము) ఇప్పుడేదిగతి. నాప్రయాసము చెడునా? సరి. (ప్రకాశము) గణదాసా! ఆర్యపుత్రుని యుత్సాహకారణమగు నీవిషయమునుండి తొలఁగిన నీకు లోపమేమి? నిష్ప్రయోజనమగు నీయత్నమెందులకు?

గౌత—దేవి మంచిమాట చెప్పినది. సఖా! గణదాసా! సంగీతోపదేశ వ్యాజమున లభించుచున్న సరస్వతీ ప్రసాద గ్రాసములఁగు సుఖములఁదిని హాయిగఁ గాలము గడుపక యీ శుష్క కలహముతో లాభమేమి?

గణ—నిజముగా దేవిగారి మాటల కిదియే యర్థము.

చ. ధరణిఁ బ్రసిద్ధినొందితని తాఁ గలహింప భయంబుజెంది దు
ర్భరమగు నన్యకర్తృక పరాభవమోర్చెడివాని విద్య యా
దర భరణార్థమేని సతతంబు నచించెది రార్యులెల్లరున్
సురుచిర శాస్త్రపణ్య వణిజుండనుచాతని వేయునోటులన్.

ధారి—(గణదాసునుగాంచి) క్రొత్తగదా శిష్యజనము మీకడ ప్రవేశించి బాగుగ పరిచయముగలుగని దానివిషయమై యామెను నియోగించుట న్యాయమా?

గణ—కనుకనే యీ నిర్బంధము.

ధారి—అట్లైన నిరువురును భగవతికి దమ తమ యుపదేశ చాతు ర్యమును జూపుదురుగాక.

పండి—దేవి! ఇది యుచితముగాదు. సర్వజ్ఞురాలైనను నొక్కతె గుణ దోషముల నిరూపింపఁ బూనుట దోషకారణము.

ధారి—(జనాంతికము) మూఢురాలనగు నో పరివ్రాజికా మేల్కొని యున్నను నన్ను నిద్రించుదానిగఁ జూచెదవేల (అని అసూయతో మొగమును ద్రిప్పును. రాజు పండితకౌశికికి దేవిని జూపును)

పండి—(దేవిని జూచి)

తే. కారణము లేక యేల రాకాశశాంక
వదన గినిసెను విభుని గోపమున నిపుడు
కాంతలు సమర్థులైననుగాని భర్త
లందున సహేతుకంబుగ గుందదుగద?

విదూ—ఏమీ? కారణమేల లేకుండును. స్వపక్షమును రక్షించుకొను టయే గొప్పకారణము బాగుగ నేర్పఁబడినను సర్వమగు నుపదేశము ప్రయోగించుట కష్టముగదా?

గణ—దేవి! వింటివిగదా? ఎల్లవారును నిట్టే తలంతురు కావున

తే. కలహమునఁ జూపనేర్తునా కలిగినంత
యెల్ల నుపదేశగరిమంబు నిచటనీరి
కాజ్ఞనిడవేని యెటకేని యరుగుదింక
దావకోదార రక్షణఁ దలఁప కిపుడు.

(అని యాసనమునుండి లేవఁబోవును.)

ధారి—(స్వగతము) ఆహా ఇంక మార్గమేమి (ప్రకాశము) శిష్యజన మునందలి విశ్వాసమున శపథముగూడఁ జేయుచుంటివి. కానిమ్ము.

గణ—(నిట్టూర్పువిడచి) చాలసేపు వ్యర్థముగ ననుమానాస్పదుఁడ నయితిని. దేవిగారి కిప్పటికి నాయందు నమ్మకము గలిగెనా? (రాజును) దేవా? ఏవస్తువునందు నా నేర్పిన యభినయమును బ్రదర్శింపుమందునో యానతీయుఁడు.

రాజు—భగవతి కేది రుచించునో యదియే మాకును రుచించును.

గణ—(పండిత కౌశికినిజూచును)

పండి—దేవిగారెందులకో సందేహించుచున్నట్లున్నారు.

ధారి—సందేహమేల? నీవే నిర్దేశింపుము. సర్వజ్ఞురాలవుగదా!

పండి—నాలుగు పాదములు గలదిగ శర్మిష్ఠచే రచియింపఁబడిన ఛలికమును నభినయము బ్రయోగింపఁ గష్టమని లాక్షణికులు వక్కాణింతురు. అయ్యది ప్రదర్శించినచో వీరి పాండిత్యము నుపదేశ విధానము తేటపడఁగలదని నాయభిప్రాయము.

ఉపా—భగవతి వాక్యము శ్లాఘ్యముగా నున్నది.

గాత—అట్లయినచో నిరుపక్షములవారును ప్రేక్షాభవనములో సంగీత ప్రయత్నముసల్పి మాకు దూతనంపుఁడు. పోనీ దూతగూడ నెందులకు మృదంగధ్వనియే మమ్మాహ్వానము చేయఁగలదు.

హార—అట్లే (యని లేచును.)

గణ—(దేవినిగాంచును.)

ధారి—గణదాసా! జయముగాంచుము. నేనును మీజయమునే గోరుచుందును.

ఉపా—(పోవుచుందురు.)

పండి—అయ్యా! ఒక్కమాట వినుఁడు.

ఉపా—చిత్తము. (అని వెనుకకు వత్తురు.)

పండి—మీ యిరువుర తారతమ్యము తెలియుటకై చెప్పుచుంటిని. సర్వాంగ సౌష్ఠవము స్పష్టమగుటకై పాత్రములఁ గొద్ది నేపథ్యములతో బ్రవేశ పెట్టుఁడు.

విదూ—ఇది వారికి చెప్పనవసరము లేదులెమ్ము.

(ఉపాధ్యాయులు నిష్క్రమింతురు)

ధారి—(రాజునుగాంచి) ఆర్యపుత్రునకు రాచకార్యములందుగూడ నిట్టిరుచిభిని వేశముండిన బాగుండునుగదా?

రాజు—ఉ॥ **మానవతీలలామ! వినుమా? వచియించెద నీపరీక్షనేఁ**
బూనితినంచు సంశయముబొందకు నెమ్మదిలోన నీవునేఁ
డీనిపుణుల్ పరస్పర జయేచ్ఛ నొనర్చిరి కీర్తికాముకుల్
పూనికతోడ నన్యయశమున్ ధరవృద్ధిని గాంచనిత్తురే?

(తెఱలో మద్దెలమ్రోగును అందరును వినుచుందురు)

పండిత—సంగీతము ప్రారంభింపఁబడినట్లున్నదే?

మ॥ జలదారావమటంచు భ్రాంతివడి యుత్సాహంబునన్ గంధరా
వళిపై కెత్తి మయూరసంతతి ప్రతిధ్వానంబుగావింపఁగాఁ
లలితంబై మురజంబునన్ గలిగినీలన్ షడ్జమంబట్లుగాఁ
దొలినీమూర్ఛన హృత్సరోజముల సంతోషంబుఁ బొందించెడిన్.

రాజు—దేవీ! మనమిాప్రయోగింపఁబోవు నాటకమునకు సామాజ కుల మగుదమురమ్ము. (అందరు లేతురు)

ధారి—(స్వగతము) ఏమియీయార్యపుత్రునిదుండగము

విదూ—వయస్యా! మెల్లగానడువుము. దేవిగారికిఁగోపము రాఁగలదు

రాజు—(స్వగతము)

తే॥ సిద్ధిమార్గంబు నెమ్మదిఁ జెందఁగోరు
నామనోరథశబ్దంబు నాగనిపుడు
ధైర్యమునుదాల్చిననుగాని త్వరయొనర్చు
నతిమనోహరమగు మృదంగారవంబు.

(అందరునిష్క్రమింతురు.)

(ఇదిప్రథమాంకము)



# మాళవికానాటకము.



(ద్వితీయాంకము). రాజభవనము.

(తరువాత రాజు ధారిణి గౌతముఁడు పండితకౌశికి బరివారము ప్రవేశింతురు)

రాజు—భగవతీ! పూజ్యులగు నీయిరువురిలో నెవరిప్రయోగము ముందుగఁజూడఁదగును.

పండి—జ్ఞానమునం దిరువురును సమానులైనను గణదాసు వయోవృద్ధుఁడగుటవలన నాతనిప్రయోగమే ప్రథమమునఁ జూడఁదగు నని తోఁచుచున్నది.

రాజు—అట్లైన, జయసేనా! ఉపాధ్యాయులకు భగవతివాక్యము నెఱిఁగించి యిందుగణదాసుని దోడ్కొనిరమ్ము.

ప్రతీ—ఏలినవారియాజ్ఞ. (అని నిష్క్రమించును)

గణ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక. మధ్యలయగలిగి శర్మిష్ఠచే రచియింపఁబడిన చతుష్పదమందలి శ్లోకమును నిశ్చలచిత్తులై విందురుగాక.

రాజు—ఆచార్యునందలి గౌరవమున నవహితచిత్తుఁడనై యున్నవాఁడను. (గణదాసు నిష్క్రమించును)

రాజు—(జనాంతికము) వయస్యా! గౌతమా!

తే॥ ఎలమి నేపథ్యమున జరియించునట్టి
కాంతఁ గన్గొనియెడి కౌతుకంబు కల్గి
నస్మదీయాక్షులీ కాలయాపనమున
కోరునవక తెఱఁదీయఁగ గోరునిపుడు.

గౌత — రాజా! ఇప్పటి మీస్థితిఁ జూడఁ గుడుపఁబోవుచుఁ గూరలగుచి విచారించునట్లున్నది.

(తరువాత గణదాసు చూచుచున్న శరీరసౌష్ఠవముగల మాళవిక ప్రవేశించును)

గౌత — (జనాంతికము) ఇదే చూడుము నీమనోహారిణి చిత్తరువున జూచినప్పటికన్న నెంతయందముగానున్నదో?

రాజు — (జనాంతికము) మిత్రుఁడా!

చ॥ చెలితల మానికంబునటఁ జిత్రమునన్ గనుగొన్న నిట్టిన
న్నెలుజలాక్షికిన్ గలుగునా? యనిసంశయమొంది తిప్పుడీ
యలరెడి సోయగంబుఁ గని నంతనె భాగ్యములౌ పదార్థముల్
గలుగవు శిల్పికంచు మది గట్టెడునిశ్చయ మిట్లు వ్రాయఁగన్.

ఆహా! ఇప్పటికిఁ గదా నేను కన్నులు గలవాఁడనైతిని.

గణ — బిడ్డా! భయమొందకుము.

రాజు — (స్వగతము) సర్వాంగములయందును నీరూప మనింద్యము

మ॥ అతిదీర్ఘాంబులు లోచనంబులు సముద్యచ్చంద్రబింబంబు మో
ము తులాంసంబుల వ్రేలుబాహువులు సాంద్రాకారవక్షోరుహాం
చితమై వెల్గునురంబు మధ్యపదమా? జీర్ణంబుపాధ్యాయుఁడే
గతిగాఁ గోరునో యట్టులీకలికి యంగంబుల్ ప్రకాశించెడిన్॥

అహా! ఈలతాంగి సౌందర్య మవ్యాజము కనుక నే

చ॥ పట్టినవాఁడిపోవు విరిబంతులు చేతులతోడ నింతయున్
బట్టకయున్నచో రసము బట్టవిలన్ గజనిమ్మపంక్తి ని

టిట్టన నేల నీజలరుహేక్షణ వట్టువచన్నుదోయి చే
పట్టినఁబట్టకుండినను వాడదు నీరసమొంద దెంతయున్॥

(మాళవిక స్వరము వేసి చతుష్పదవస్తుకమును పాడుచున్నది.)

చ॥ హృదయమ! దుర్లభుండు ప్రియుఁడిప్డు నిరాశవుగమ్ము వానిపై
పదపడి చంచలించెడిని వామవిలోచన మించు కేలకో?
సుదయితుఁడాతనిన్ మరలఁ జూచెడిభాగ్యమి కెప్పుడబ్బునో?
సదయహృదీశ! గన్గలయ సంతసమొందితినంచు నెంచుమా?

గౌత—(జనాంతికము) వయస్యా! చతుష్పదాభినయ వ్యాజంబున
మాళవిక తనను నీకర్పించుకొనుచున్నది.

రాజు—(జనాంతికము) మిత్రమా! మా యిరువుర హృదయంబులు
నట్టివే.

చ॥ వలఁపుగలట్టిదానిగ నృపా! యనుమానము లేక నన్ను లోఁ
దలఁపుమటంచుఁ బల్కుటకు ధారిణిచెంత వసించియుంటచే
వలనుపడంగలేమిఁ దనవక్షమునన్ జెయిఁజేర్చి యాసతీ
తిలకమునన్నృతార్థునిగఁ దెల్పెడు భావికకైతవంబునన్॥

(గీతాంతమున మాళవిక వెడలఁబోవును)

గౌత—అమ్మా! పోకుపోకు. ఇంకను నీ యభినయము నిర్దోషము
కాలేదు.

గణ—బిడ్డా! నిలువుము అభినయమునిర్దోషమని నిరూపించి వెళ్లుదువు
(మాళవిక నిలుచును)

రాజు—(స్వగతము) ఆశ్చర్యము సర్వావస్థలయందును నీతరుణిచక్క
దనము శోభాంతరమును పోషించుచున్నది.

సీ॥ సంశ్లేషభాగ ని ♦ శ్చలవలయంబైన వామహస్తము
నితంబమునఁ జేర్చి
తాద్భగ్గితీయహా♦ స్తము మనోహారమగుఁ
దీవియమాడ్కిఁ గ్రిందికిని జార్చి

చారుపాదాంగుష్ట • చాలిత కుసుమమా
గుట్టిమస్థలమునఁ గూర్చిదృష్టి
కమనీయ చంద్రికా • కల్పమాదరహాస
మధదారుణాంశుల నలరఁజేసి
సకలసామాజిక ప్రపం • చ హృదయముల
వికసనమొనర్పఁజేసి యి• వ్వేలఁదిసల్పు
నభినయమున నుత్తర కాయ • మలరెనిపుడు
సరళమును మనోహరమునై • సరసమగుచు.

ధారిణీ—ఆర్యపుత్రులు గౌతముని మాటలఁగూడ పాటింతురా?

గణ——దేవీ! దేవరవారి విశ్వాసమువలన గౌతముఁడు కూడ సూక్ష్మ బుద్ధి గలవాఁడయ్యెను.

తే॥ చిల్లగింజలయోగంబు • చేతఁ గల్మ
షంబులగు జలములును స్వ • చ్ఛత వహించు
మాడ్కి సత్సంగతిని మూఢ • మతికినైనఁ
గలుగునిల బుద్ధికుశలత • ఘనులుమెచ్చ॥

(గౌతముని జూచి) అయ్యా! ఈ యభినయమునఁ దమకేమైన సంశయములు గలుగునేని యడుగుఁడు.

గౌత—ముందుగ నభినయ మెట్లున్నదో ప్రాశ్నికురాలి నడుగుఁడు

గణ——భగవతీ! గుణమో దోషమో తమ యభిప్రాయమును దెలియఁగోరెదను.

పండిత——మీ యుపదేశ మవింద్యము. మీ శిష్యజనము సంభావింపఁదగినది,

శా॥ అంతస్థాపిత సార్థవాగవయ న • వ్యాపారతః భావ మ
త్యంతంబుః దెలియంగఁజేసి చరణ•న్యాసంబు తాళక్రియా
కాంతిః జెంద రసప్రపంచమగు శా•ఖాతుల్య నాట్యంబునః
సందోషంబొనరించె నీవెలఁది య • స్మత్స్వాంతముల్ రంజిలః॥

గణ—(సంతోషము నభినయించుచు) దేవరచిత్త మెట్లుండునో?

రాజు—మాకు స్వపక్షముమీఁద గౌరవము క్షీణించినది.

గణ—(నిట్టూరు విడచి) ఇప్పటికిగదా నాట్యాచార్యుఁడనైతిని.

తే॥ ఎవని యుపదేశ చాతుర్య ♦ మెల్ల నగ్నిఁ
గాంచనముఁబోలెఁ గలుషంబు ♦ గాకయుండు
వాని యుపదేశ మఖిల వి ♦ ద్వాంసులందు
దోషరహితంబునగుచు సం ♦ తోషమొసఁగు॥

ధారి—(సగర్వము) పరీక్షకులు మెచ్చుటవలన నాచార్యునికిప్పటికి మనసు కుదుటఁబడినది.

గణ—(ధారిణిగాంచి) అమ్మా! మీరు నాట్యాచార్యునిగ నన్ను నియమించుట నాయభివృద్ధికిఁ గారణముగదా? (గౌతముని జూచును.)

గౌత—అప్పుడే జయముగలిగినదని సంతోషింపకుఁడు నేనిక్కడనే యుంటిని.

గణ—అవునవును. మీయభిప్రాయముగూడ నెఱింగింపుడు.

గౌత—మొదట బ్రాహ్మణపూజ జేసిగదా యభినయమును బ్రారంభించు నాచారము. అది మీరుమరచితిరి గావున మీయభినయము ప్రథముననే దుష్టమయినదని నాయభిప్రాయము.

పండి—ఈ ప్రశ్న బాగుగనే యున్నది. (మాళవికదరహాసము జేయును అందరు నవ్వుదురు.)

రాజు—ఇదిచాలా సుదినము. (ఆత్మగతము)

ఉ॥ ఇంచుక గానవచ్చు రదనేందిరచే నలరారు నీవిశా
లాంచితనేత్రమైన లలితాంగి ముఖంబుస్మితంబొనర్చుచుఁ
గాంచంగనయ్యె నిప్డు పరికంపిత కేసరలక్ష్యమాణని
ర్వంచితమైన పంకజముభాతి మదీయవిలోచనంబులన్.

గణ——(గౌతమునిజూచి) మహాబ్రాహ్మణుఁడా! ఇది ప్రథమమున జేయఁదగిన రంగపూజకాదుగదా! అట్లయినచో సంభావనార్హుఁడవగు నిన్నేలఁ బూజింపకుందుము?

గౌత——ఇస్పీశుష్కజలదస్తనితంబగునంత రిక్షమునందలి జలపానము గోరుచాతకమువలె విఫలమనోరథుండనైతినే?

పండి——అవును నిజమే.

గౌత——గణదాసా! లోకములో మూఢజాతి పండితవాక్యమందలి విశ్వాసముగలదిగదా! అందువలనఁ బండితకౌశికినలన నొప్పువడసిన మీకుబహుమానము చేయకుండుట దోషము. ఇదిగో కడియము బహుమానము చేయుదుము. (అనిరాజుచేతినుండి లాగఁజోవును.)

ధారి——ఉండుముండుము. గుణాంతరమెఱుంగక బహుమతిచేయుటేల?

గౌత——ఇతరులదికదాయని.

పండి——దేవీ! ఈగౌతమునివలనఁ గాలక్షేపము చేయవచ్చును సుమా?

ధారి——గణదాసా! మీశిష్యజనముపదేశము జూపుటకైనది.

గణ——అమ్మాయీ! పోవుదమురమ్ము.

(మాళవికయు గణదాసు నిష్క్రమించును.)

గౌత——(జనాంతికము రాజుతో) వయస్యా! నీకునావలననగు సాయమింతయే.

రాజు——(జనాంతికము) ఇంతయేయని నియమింపకుము.

తే॥ కలధనంబెల్ల సంతము గాంచినటుల
ఐతులితోత్సాహము వినాశమందునటుల
ధీరతకుఁగవాటంబు బంధించినటులఁ
గామినియదృశ్యయయ్యె నాకనులకిపుడు.

గౌత——(జనాంతికము) బాగుబాగు దరిద్రుండగు రోగివలె మందుకూడ వైద్యుండే యివ్వవలెనని కోరుచున్నావే?

హర—(ప్రవేశించి) నాయుపదేశముగూడఁ బ్రదర్శించుట కనుగ్రహింపుడు.

రాజు—(స్వగ) దర్శనప్రయోజనము పూర్తిసది. (ప్రకాశము) దాక్షిణ్యము దాల్చి మేమును కుతూహలము గలిగియేయున్నాము.

హర—చిత్తము ఏలినవారిదయ. (తెరలో)

దేవా జయమగుగాక.

సీ॥ అమలవాపీపంకజాగ్ర పత్రచ్ఛాయలందు సరాయంచలధివసింప
సని వారితోష్ణ సౌధావళీవలభుల దరిఁజేరఁబారావతములుగుండ
దాహాపశమనభూతంబులౌ జలయంత్రసమితిఁ జేరఁగ మయూర (ములుబోవ
ప్రకటయుగాంత సంభవదురగేడ్వషజ్వాల నాపడమరగాలివిసర
నఖిలసత్వవ్రజంబు గుహాంతరముల
నిదురవోవంగనీవు నీనిఖిలగుణగ
ణములచే వలెవేయుకరములతోడ
గగనమున సంచరించు నాకర్మసాక్షి.

గౌత—అయ్యో అయ్యో రాజుగారికి భోజనవేళ యయినట్లున్నదే? వేళదాటినవైద్యులు దోషమందురేమో? హరదత్తా! ఏమందువు.

హర—ఇప్పుడేమనుటకును నవకాశమెక్కడిది.

రాజు—అట్లయిన నీయుపదేశమును తేపటగాంచగలచగలము.

హర—ఏలినవారి చిత్తము.

ధారి—ఆర్యపుత్రులిక మాధ్యాహ్నిక కృత్యముల నివర్తింతురుగాక.

గౌత—అమ్మా! విశేషముగ పానభోజనము త్వరచేయింపుము.

పండి—(లేచి దేవ! జయమగుగాక. (దేవితో నిష్క్రమించును హరదత్తుడును నిష్క్రమించును.)

గౌత — దేవ! మాళవిక రూపమునగాక శిల్పమునందునను నద్వితీయమే?

రాజు — మిత్రుఁడా

తే. వనజభవుఁడు స్వభావలావణ్యరాసి
నంబుజాస్యను లలిత శిల్పంబుతోడ
రతిపతివిషాక్తమైన శరమ్ముపోలె
సృష్టినొనరించెఁబురుషహృచ్ఛేదనకయి.

వేయేల? నా ప్రాణములు నీయధీనములు.

గౌత — అంగడి పెనములాగున నాకడుపు దహించుకొని పోతున్నది. కాన నా ప్రాణములె నీయధీనములని చెప్పుటమంచిది.

రాజు — నీవు నాకైగూడ నిట్లే త్వరపడుము.

గౌత — ఆ తెలిసినది సజలమేఘచ్ఛన్నయగు జంద్రికవలె మాళవికయు స్వతంత్రతు రాలైనది. నీవుజూడ కటికి దుకాణమువిూఁద నినుగు గద్దవలె నామిషలుబ్ధుఁడవు. కాన తొందరపడకుము.

రాజు — ఏల తొందర పడకుందును.

సీ. సకల శుద్ధాంత కాంతా ప్రసంగమందు
నించుకేని జరింపని హృదయమిప్పు
డావరారోహ కాధీనమగు మనోర
థంబుకలిగినదయ్యో మిత్రంబకనుమ.

గౌత — అవును తరువాత జూతము నేటికి వెళ్ళుదము రమ్ము వేళ యయినది. (అందరు నిష్క్రమింతురు)

(ఇది ద్వితీయాంకము.)





# మాళవికానాటకము



## తృతీయాంకము.

(తరువాత సారసకుఁడు ప్రవేశించును) ఉద్యానవన మార్గము

సార—సారసకా! రాజుగారి యుద్యానవనమున కేఁగి యొక మాదీఫలమును గొనిరా అని భగవతి నాతో చెప్పినది. అందుచేత నాలస్యము చేయక యుద్యానవనమునకుఁ బోయెదను. (పరిక్రమించిచూచి) అదుగో ఉద్యాన వనపాలకుఁడు కుబ్జుఁడు శృంగారపశోకమును చూస్తూ వున్నాఁడు నేను వానిదగ్గరకుఁ బోయెదను.

(తరువాత కుబ్జుఁడు ప్రవేశించును) ఉద్యానవనము.

సార—(సమీపించి) ఓహో కుబ్జుఁడా? నీ యుద్యానవనము బాగుగా నున్నదా?

కుబ్జు—(చూచి) సారసకా! చాల రోజులకుఁ గనుబడితివే సంగతులేమిటి?

సార—ఓరీ! కుబ్జుఁడా! ఎన్ని రోజులబట్టియో నిన్ను చూడవలయునని కోరుచున్నాను. తీరిక లేకపోయినందున సంభవించలేదు. వట్టి చేతులతో మావంటివాండ్లు దొరగారిని చూడటం బాగుండదు. సారసకా! నీవుపోయి మాదీఫలము తెమ్మని అని భగవతియంపగా వచ్చితిని.

కు॥—మాదీఫలముకేమిగాని కావలసినన్ని తీసుకో. అయితే నేను గొప్ప నేనుగొప్ప అని హరదత్తయ్యగారు గణదాసయ్యగారు పోట్లాడుకొని రాజుగారిదగ్గరకు పోయిరే వారిద్దరిలో రాజుగారెవరిని మెచ్చుకొన్నారు?

సార—ఇద్దరూ చదువులోనూ నేర్పరితనంలోను గొప్పవాండ్లే అయితే మాళవికమ్మ తెలివిగలదికాబట్టి రాజుగారు దాసయ్యనే మెచ్చుకొన్నారు.

కు॥—బాగె బాగె మొదటినుంచి నేను అట్లాగే తలచాను. కాని మాళవికమ్మ సంగతేమయింది?

సార—రాజుగారికి మాళవికమ్మమీంద చాలాకోరిక కలిగినను ధారిణీదేవమ్మగారికి కోపం వచ్చునేమో అని తొందరపడకుండా వున్నాఁడు. మాళవికమ్మమాత్రం తీసేసిన పూలదండ మోస్తను వాడిపోయింది.

కు॥—అబ్బా! ఎందుకోను

సార—ఏమో తెలియదు. ఇంక నన్ను తొందరగా పంపుము.

కు॥—ఇదిగో కొమ్మను వ్రేలుచున్నది మాదీఫలము మెల్లగా కోసుకొనుము.

సార—(నాట్యముతో కోసికొని) పోతాను.

కు॥—నేనుగూడా వస్తానుఉండు. ఈ అశోకపుచెట్టు పూయటంలేదు. అమ్మగారితో చెప్పి దోహదం చేయించాలి.

( ఇరువురు నిష్క్రమింతురు.) ఇది ప్రవేశకము.

(తరువాత విరహావస్థతో రాజును గౌతముఁడును ప్రవేశింతురు.)

ఏకాంతభవనము.

రాజు—(తనను జూచుకొని)

చ॥ తనువుగృశించునేమొ వని • తామణి కౌగిటగూర్పలేమిచేఁ
గనులను బాష్పబిందువులు • గప్పెడినో సతికానరామినో

మనము! మృగాయతాక్షి నిసుమంతయుఁ బాయఁ బోకవ్వఁడేనియున్
జనునటె? నీకుఁ దన్మయుసు ♦ సౌఖ్యముగల్గినఁగాని చింతిలన్.

(గౌతముని జూచి) మిత్రమా!

ఉ॥ ఆరమణీలలామఁ గని ♦ నప్పటినుండి తదీయమోహనా
కారమునందె లగ్నమయి ♦ క్రమ్మర నేరక నామనంబు వ్యా
పారములం దొకింతఁ గూర ♦ బోరదు నిల్వఁగనీయనక్కటా
ధారిణి మున్నుఁగాఁగఁ బ్రియ ♦ దారలనైన గణింపదిమ్మెకన్.

మ॥ ఘనమై కౌతుకకొండరంగుగల ♦ గాఢాంబుముద్రాప్పసి
వనజాతాసనవేణిఁ జేరి సుఖియిం ♦ పన్ జాబిపూర్వంబు తా
ననయంబే తపమాచరించెనొకదా? ♦ యారీతి భాగ్యంబు నా
కనఘా! నీవలనన్ లభింపనగునే ♦ యయ్యా గౌతమా! యూపయిన్.

గౌత—రాజా! జగదేయనాయకుఁడవగు నీకోరిక రిత్తయగునా?

రాజు—నీవన్నది నిజమే. అయినను ప్రస్తుతస్థితినిబట్టి చూడ,

మ॥ అరిగాపుల్ వినతాంగులై రథగజా ♦ శ్వానీకము న్గాస్కగాఁ
బరగింపన్ జతురబ్ధివేష్టితమహీ ♦ భాగంబు భోగంబుగా
ధరియింపఁగల నేర్పుగల్గినను స్వా ♦ తంత్ర్యంబు లేదయ్యె నీ
సరసీజాననతోడఁ గూడఁగ వయ ♦ స్యా! నాకొకింతేసియున్.

గౌత—(విచారము నభినయించుచు) రాజా? నీకిట్లు ధైర్యము చెడి చింతించుట తగదు. నీచెప్పిన వర్తమానము వకుళావళిక[illegible] జెప్పితిని. నూఱువిధముల ఫలించగలదు.

రాజు—(ఆదరముతో) ఆమె దానికి ప్రత్యుత్తర మేమిచెప్పెను?

గౌత—ఈసందేశమువలన ననుగ్రహింపఁబడితిని. ఆదీనురాలు దేవిగారిచే మునుపటికన్న నతిజాగ్రతతోఁ గాపాడఁబడుచున్నందువలన నిప్పు డావిషయమై యేమిచెప్పుటకును పిలుగాకున్నది.

అయినను నాశక్తికొలందిగఁ బ్రయత్నించి యేలినవారి యను
గ్రహము సంపాదించుకొనియెదను” అని యున్నది. దానికి
నేను వకుళావళికా! యెట్లయినను గార్యము సమకూర్చితివా?
గొప్ప బహుమతి చేయుదునని వ్రాసి పెట్టితిని.

రాజు—కానిమ్ము విధి యగోచరముకదా! (స్వగతము) భగవంతుఁ
డవగు నో సంకల్పసంభవా! ప్రతిబంధములగు కార్యము
లనుఁ బ్రవేశింపఁజేసి కాలాంతరమునందుఁ గాకుండునటుల
బాధింపఁదగునా?

తే॥ హృదయమునఁ దేకమగుఁబ్రేమ ♦ మోసమా? నిటుల
జగతి విశ్వాసపాత్రమా ♦ శరమదేడ?
నేది మృదువును దీక్ష్ణము ♦ మొనఁగు సదియు
నీకడఁ గానవచ్చు ర ♦ మారుమార!

గౌత—అయ్యా! ఈకార్యము సాధించుటకు మఱియొక యుపాయము
గూడ నాలోచించితిని. వేగిరపడకుము.

రాజు—అవసరములగుఁ గార్యములందు గూడ నామనస్సు ప్రవేశిం
చుటలేదని నీకుఁ దెలియునుగదా? ఈదినశేష మెక్కడఁ
గడుపఁగలను.

గౌత—వసంతాగమసూచకములగు నెఱ్ఱగోరంట మొగ్గలఁ గానుకగఁ
బంపి “యీవసంతసమయమున నాప్రియపుత్రునితోడఁ బ్రమద
వనమున నుయ్యాల నూఁగఁగోరుచుంటిననీ” నిపుణికాముఖమున
నిరావతి యిప్పుడే చెప్పి పంపినదికదా? కావున మనమిపుడు
రముద్యానవనమున సుఖముగఁ గాలము గడుపుదమురమ్ము.

రాజు—ఇప్పుడది సరిపడునా?

గౌత—ఎందువలన?

రాజు—స్వభావనిపుణాండ్రగుదురుగదా స్త్రీలు! నేనెంత లాలించు
చున్నను పరకాంతాలగ్నమగు నాచిత్తము నిరావతియొక్క

కనిపెట్టుకుండును. కావున,

తే॥ విఘ్నకారణములు • వేయుగఁ గలయెడఁ
ప్రణయభంగమైన • వలయుజుమ్మి
ఆదికన్నన్నధిక • మైనలాలన యొప్పు
భావశూన్యమైన • పడతులందు.

గౌత—సర్వజ్ఞుఁడవగు నీకీవిధమున నొక్కపరిగ శుద్ధాంతకాంతలందు దాక్షిణ్యమును భేదించుట తగునా ?

రాజు—అట్లైనఁ బ్రమదవనమునకు మార్గము జూపుము.

గౌత—ఇదిగో ఈదారి కెదుటగానున్నది. మెల్లగా రమ్ము.

(పరిక్రమింతురు.)

గౌత—గాలికిఁ గదలుచున్న చివురాకువ్రేళ్ళతోఁ బ్రమదవనలక్ష్మి నిన్ను లోపలికి ప్రవేశింపుమని త్వరపెట్టుచున్నట్లున్నది.

రా—(స్పర్శసుఖ మభినయించి) గౌతమా! ఈవసంతుఁడున్నతకులీనుఁడు గదా? చూడుము.

చ. మదకలకోకిల ప్రకర • మంజులవాసితసాదరోక్తి నీ
మదనదశ న్సహింపుమని • మాకు వచించు వసంతుఁడిప్పుడా
మృదులరసాలకుట్మల ప • రీమళ దున్నతగంధవాహనున్
బొదలెడిచేతితో నిమిరె • భూసురమామక దేహ మెల్లెడన్.

గౌత—లోపలికి రమ్ము హాయిగా సుఖపడుదావు. (ప్రవేశింతురు)

ప్రమదవనము.

విదూ—వయస్యా! జాగరూకుఁడవై చూడుము. ఇదే నిన్ను లోభింప జేయుటకై ప్రమదవనలక్ష్మి యువతివేషమునకు లజ్జాకరము నగుఁ గుసుమాలంకారము దాల్చినది.

సీ. అధరోపభోగమౌ • యావకంబును బోట
లాశోకలతతోడ • నపహసించి

మకరికాపత్రాది మండనంబు ద్రివణా
కురవకంబులఁ బూని ♦ పరిభవించి
తిలకరచనను సం ♦ కలితద్విరేఫమౌ
తిలకప్రసవముతోఁ గలఁగఁ జేసి
స్వేదాపహరణ సం ♦ శీలమౌ దాక్షిణ్యం
తము శీతలానిల ♦ ధాటిఁ బాపి
జలజలోచనల సుఖ ప్ర ♦ సాధనవిధి
సేవగాఁ జేసికొంటిగా ♦ నీవసంత
రమడనర్చెడి నధిక ♦ హృద్రాజములకు
నకలుషితమైన కౌతుక ♦ మలరఁ జేసి.

(ఉద్యానవనశోభ నిరూపించుచుందురు.)

మాళి—(ప్రవేశించి)

ఉ. ఆపదిశాధనేత హృద ♦ యంబతికర్కశమౌ టెటులంగకే
నీవిధివానిఁ గోరి జల ♦ జేక్షు సితాంబిక పాకకోర్వక
భావమునద్గుల్కనిన ♦ వంతలఁగుంది కృశించుచుంటి నా
హా విపరీతమయ్యె బ్రతు ♦ కంతయు నేటికి నాటివారిలో

చ. అనయమునమూల్యరత్న వల ♦ యంబులఁ ధాల్చి కుతూహలంబునన్
వనితలు వేనవేలుభయ ♦ పార్శ్వములందున జేరి కొల్వఁగా
జననుతుఁడైన యగ్రజుని ♦ సన్నిధి ముద్దుగ నాడుచుండు నా
కెనయగుఁ జోట నీచముగు ♦ నిట్టిదశన్ గలిగించితే విధీ.

అకటా! నిరంతర చింతాక్రాంతమానసయగు నీదీనురాలిని రక్షించి ప్రతీకారశూన్యమగు విరహానలము జల్లార్పనెవరు సమర్థులగుదురు. పరిశ్రేయోసహానుఁడగు నాయాజ్ఞసేనుని మూలమునఁగదా? నాకిట్టి యస్వాతంత్రపు జీవనము గలిగినది, ఓసీ! కులద్రోహీ! నీకేమి పాపము జేసితినిరా? నన్నగ్నిమిత్ర మహారాజు చేఁబట్టిన నెప్పటికైన మాధవసేనుఁడు విదిశాధిపతి

సాయమున నిన్ను నిర్మూలించుమనని యీపన్నుగడఁ బన్నితివా? (ఇంచుక నేపూరకుండి) ఇతరుల దూరనేల? నాదురదృష్టమున కొరు లేమి చేయుదురు? (ఆకసమువంక జూచి) ఈ నా దురదశ దలంచుకొనుటచే నిపుడెందు కొఱకిచ్చటికి వచ్చితినో తెలియుటలేదు. (ఆలోచించి) ఆ జ్ఞాపకము వచ్చినది. "గౌతముని చాపల్యంబున నుయ్యెలలనుండి పడిన నాకాలు నొప్పి గలిగినది. కాన నేను రాలేను నీవఱిగి తపనీయాశోక మైదు రాత్రులలోఁ బుష్పించునటుల దోహదము జేసువేని నీకోరిన వరమొసఁగెద' అని దేవిగారు నాతోఁ జెప్పిరి. కనుక ప్రమదవనమున కేగవలయును. నావెనువెంటనే చరణాలంకారములఁ గొని వకుళావళిక రాఁగలదు. అంతలో నాకనుబడుచెట్టునీడ నించుక విశ్రమించెద. (అట్లు జేయఁబోవును.)

గౌత—(చూచి) భళీభళీ! అదిగో కల్లుద్రాఁగి సోలువానికిఁ బానకపుఁ బిందె దొరకినది.

రాజు—(ఆశ్చర్యముతో) మిత్రుఁడా! అదియేమి?

గౌత—అదిగో! పరిమితాభరణయై మాళవిక యొంటిగ మన సమీపమునకే వచ్చినది. నీయదృష్ట మేమని చెప్పవలయును?

రాజు—ఏమీ? మాళవికయా? మాళవికయా!

గౌత—అవును. ఆమెయే!

రాజు—ఇఁక నా ప్రాణముల నిలుపుకొనవచ్చును.

తే॥ జలములన్గోరువానికి ♦ సారసార
వముసఁ దరువృతయగువాక ♦ బలె సమీప
మునకుఁ జేరినకాంత నీ ♦ మూలమునను
గానవచ్చి మదికిఁగొతు ♦ కంబొనర్చె.

ఎక్కడ నా ప్రాణేశ్వరి? ఆహా నా యదృష్టము నేమని పొగడుదును

గౌత—అదె చెట్లగుంపునుండి వచ్చుచు నల్లమబ్బులోఁ దళతళ మెఱయుఁ దొలకరికి మెఱుఁగుతీఁగెరీతిఁ గనుల మిఱుమిట్లు గొల్పుచుఁ గానవచ్చుచున్నది.

రాజు—వయస్యా! నాజీవితరూపమైన యమృతభాండమును జూచుచున్నాను.

చ॥ కనుఁగొనుమోవయస్య యధి ♦ కంబగుసట్టినితంబ మల్పమై
తనరెడికౌను తుంగవను ♦ ధాధరసన్నిభమై చెలంగు నా
స్తనయుగముల్ వెలింగెడి వి ♦ శాలవిలోచనముల్గలట్టి ప
ద్మనయనయల్ మదీయసుఖ ♦ దంబగుజీవిత మేగుదెంచెడిన్.

ఈ వరారోహ పూర్వమునకన్న విలక్షణమగు శోభావిశేషమును బోషించుచున్నది సుమీ! ఎట్లన.

చ॥ అలమధుమాస వాసరము ♦ లందు వెలుంగుచుఁ బండుటాకులన్
గలిగికొలంది పూవులఁ బ్ర ♦ కాశముజెందెడి మల్లెతీఁగెయ
ట్లలగుచు రెల్లుపూలవలె ♦ నచ్చపుఁ జెక్కులు గల్గినట్టి య
వ్వెలఁది మితావతంసయయి ♦ పేర్మిని దృక్పథమావహించెడిన్.

గౌత—ఆమెయు నీవలెనే మదనావస్థకు లోంగియుండునని తలంచెద.

రాజు—నాయందలి ప్రేమచే నీకట్లగపడనోపును.

మాళ—ఇదే సుకుమార దోహదాపేక్షచే మొగ్గదొడగక యీ యశోకరాజము విరహాతురనగు నాశోకమునను సరించు దానివలె నగుపడుచున్నది.

గౌత—వయస్యా! వింటివా? ఈమె విరహాతురనని యడుగకయే చెప్పుచున్నది.

రాజు—ఇంతమాత్రమున నీయూహ సరియనుటకు వీలులేదు కాని

తే॥ క్రొత్తగోరింటపుప్పొడిఁ ♦ గొని కిసలయ
పుటములను విప్పి శీకర ♦ ములను బూని

మలయపవనుం డిపుడు నాదు ♦ మానసమున
కకృతకారణమైన యు ♦ త్సుకతఁ గొలుపు.

(మాళవిక కూర్చుండును.)

రాజు—వయస్యా! మనమీ తీవెగుబురు చాటుననుండి నామనోహారి యేమి చేయునో చూచుచుందము రమ్ము.

(అట్లు చేయుదురు.)

గౌత—అదిగో సమీపమున నిరావతివలె నున్నదే?

రాజు—కమలిని గన్న మదపుటేనిక మొసలికి భయమందునా?

(చూచును)

మాళ—హృదయమా! ఫలింపని యీవాంఛాలత నేలఁ బెంచెదవు?

(గౌతముఁడు రాజును చూచును.)

రాజు—(ఆత్మగతము) ప్రేయసీ! అవ్యాజమైన యనురాగంబు నచ్చకతను జూడుము.

తే॥ కమలలోచన నీ విర ♦ హమున నిపుడు
కారణమెఱుంగనైతిఁ ద ♦ ర్కమునసత్య
మెఱుకపడ దించుకేనియు ♦ మఱుఁగ నేల!
నీదశకు నేనె కారణ ♦ మేమొ తలఁప.

గౌత—ఇదిగో ఇప్పుడే నీసందేహము తీరగలదు. నీవు చెప్పిన వార్తను తీసికొని వకుళావళిక రహస్య ప్రదేశమునకు వచ్చి యున్నది.

రాజు—అది మన ప్రార్థనను మఱవదుగదా?

గౌత—ఏమీ? ఈదాసి గొప్పదగు నీయాజ్ఞను మఱచునుగా.

(తరువాత చరణాలంకారహస్తయగు వకుళావళిక ప్రవేశించును)

వకు—సఖీ! కుశలముగ నుంటివిగదా?

మాళ—ఓహో వకుళావళికా! కూర్చుండుము.

వకు—సఖీ! ఈ కాంచనాశోకపాదపము మూలమునఁ గదా చిరపరిచితయగుఁ బ్రమదవనలక్ష్మిని సేవించుభాగ్యము లభించినది.

మాళ—అవును. నీవు నాకు రెండవ ప్రాణమువంటిదానవని చెప్పుచుంటిని. ఎప్పుడీప్రమదవనమున స్వైరముగ విహరింతుమాయని యువ్విళ్లూరు నాడెంద మేలకో నేఁడిందుఁ బ్రవేశించుట యన్న నిచ్చగించుటలేదు.

వకు—నాకుఁ జూడ నీయభిలషితము దీరకుండుటచే నిరంతరచింతాకులవగు నీవు చంచలహృదయనైతివని తోఁచుచున్నది.

గౌత—రాజా! వకుళావళిక చెప్పు మాటల శ్రద్ధతో వినుము.

రాజు—(తలయూఁచి వినుచుండును)

మాళ—సఖీ! యీయవస్థకుఁ గారణము నీవెఱిఁగియే యున్నావు. కాదేని క్షణమూరిన దాని కదియే తెలియఁగలదు. నాకుఁ జెప్ప నోరాడుటలేదు. ఇప్పుడేదేని యొక వినోదము గావించి మనశ్శాంతి గల్గింపుము.

వకు—అట్లైన నీవనమున నించుక విహరింతము రమ్ము. దీనిమూలమున నీడెందమునకుఁ గొంతశాంతి గలుగునేమో?

(ఇరువురు మెల్లన నడతురు.)

మాళ—సఖీ! చూచితివా? ఈసంపెంగతీఁగె దక్షిణానిలుని తాకునకు బెదరియోయన నెట్లు కదలుచున్నదో.

వకు—కాదు కాదు.

తే॥ సాటిలతకూన లెల్లను ♦ సంతసమున
నుచిత సహకారసంగతి ♦ నొందియుంటఁ
గాంచి యీపుష్పవతియైన ♦ కనకవల్లి
తగిన యాలంబనములేక ♦ తల్లడిల్లెడి.

మాళ—(స్వగతము) పాపమిా లేఁదీవెకును నాకుఁ బట్టినదశయే పట్టి నది. (ప్రకాశ) చెలీ! చూడుము. ఈరసాలమెంత మనో హరముగాఁ జిగిరించినదో.

వకు—తే॥ రమణి నీవాతెఱకు సరి ♦ రాఁదలంచి
యరుణశోభవహించి సాం ♦ పాకుదీని
మమతదీర్పంగ నేరాజ ♦ మధుపమునకుఁ
గరుణగల్గెడినో యెఱుఁ ♦ గంగరాదు.

మాళ—చూచితివిగదా పూఁగుత్తులఁజేరి మకరందము నాస్వాదించు తుమ్మెదబారు కన్నుల కింపుగల్గించుచు నెట్లు ప్రకాశించు చున్నదో.

వకు—సఖి! ఇదే కాంచనాశోకము నిన్ను చూచి తనకు దోహదము చేయుదువుగదా యని సంతోషించుచున్నది.

మాళ—అవును నిజమే.

వకు—నీవిందులకు ముఖ్యముగ యోగ్యురాలవని దేవిగారు వినియో గించిరి. దోహదమునకై వేగిరపడు నశోకము నాలసింపక సత్కరించుదువు. ఒకకాలిటు చెమ్మ పారాణిఁబూసి యుందె దొడఁగెదను.

వకు—(స్వగతము) హృదయమా! ఈ యైశ్వర్యము వచ్చినదని సంతోషింపకుము, కానీ యిది నాకు మృత్యుమండనము కాఁగల దేమో?

వకు—ఆలోచించెదవేల? ఈ యశోకము పూయుటకు దేవిగారు తొందరపడినది గదా?

రాజు— ఏమిా? అశోకదోహదమునకా యీా ప్రయత్నము?

గౌత— ఇంకను నీకుఁ దెలియదా? నిష్కారణముగా నంతఃపురాలం కారమును బరిజనమున కెట్లిడునని తలఁచితివి?

మాళ— (కాలినిఁ జూచి) సఖీ! కాలికిమాత్రము నొప్పిగలిగింపకుము

వకు— నీవును నా ప్రాణమే గదా? (అని చరణాలంకారము జేయును)

రాజు—గౌతమా! చూడుము.

తే॥ పడఁతి చరణాగ్రమునఁ బూయఁ • బడినయట్టి
యార్ద్రమగు రాగ లేఖ పు • గారిపాల
నయనమున భస్మమైన మ • న్మథమహీరు
హము ప్రథమపల్లవోత్పత్తి • నాఁగఁ దనరు.

గౌత— కాలికిఁ దగినపనియేసుమా? దేవిగారిమొకుఁ గల్గించినది.

రాజు— బాగుగా నుడితివి.

చ॥ స్ఫురితనఖప్రభాయుతము • శోభితపల్లవ తామ్రమార్ద్రమౌ
చరణముతోడ దోహదవ • శంబున బూవులులేని యీయశో
కరుచిభూరుహంబును బ్ర • కాశమునొంద నతాస్యగామనో
హరు నొనరింప నీకలికి • యారసి కొట్టఁగఁ యోగ్యయౌఁగదా?

గౌత— ఈమెయెడ నపరాధముజేయ నోచుకొన్నావులే. తొందర
పడకుము.

రాజు— సిద్ధిగోరు నీవాక్యము పరిగ్రహించితిని.

(తరువాత మదమున నిరావతియు చేటియు ప్రవేశింతురు)

ఇరా— ఓసీ! కౌముదికా! విశేషముగ మత్తకాశినులకు మత్తతయే
యలంకారమని విందును. ఈ కింవదంతి సత్యమే కదా?

కౌము— ప్రథమమున నిది లోకవాదము. కాని యిప్పుడు సత్య
మైనది.

ఇరా—మంచిది. (తల యూచి) మోమోటమునఁ గాక నిజముగా
జెప్పుము. ఱేఁ డెలయింటికి దొరగారు వచ్చి యుందురా
లేదా?

కౌము—భట్టినియందలియని వారితమగు ప్రేమచే వచ్చియేయుందురు.

ఇరా—నిజమా? నీకెట్లు తెలియును.

కౌము—వసంత నైవేద్యములఁగోరు గౌతమయ్య నాతో జెప్పెను. వేగముగ నడువుము.

ఇరా—మత్తుచే సోలిపడుచున్న నన్నార్యపుత్రుని దర్శనమునకై హృదయము త్వరపెట్టుచున్నది. అడుగులు మాత్రము సాగనీయవు.

కౌము—ఇదే యుయ్యాల యింటికి రానేవచ్చితిమి

ఇరా—(చూచి) ఇక్కడ నార్యపుత్రుఁడు గానరాఁడేమి?

కౌము—భట్టినియందలి యనురాగాతిశయమున వచ్చియుఁ బరిహాసమునకై కనుండకుండనే తీఁగెచాటుననైన డాఁగియుండునేమో బాగుగాఁ జూడుము. మనముగూడ నీ ప్రియంగు లతాపరివృతమగు శిలాపట్టమునఁ గనుబడక డాగియుందము. తరువాత తెలియును. (ఇరువురు నట్లుచేయుదురు.)

కౌము—(ముందునకుఁ జూచి) చూడుము భట్టినీ! మామిడిచిగురు వెదకు కోయిల కెఱ్ఱచీమ గానవచ్చినది.

ఇరా—అదేమే? అసందర్భ ప్రలాపము జేసెదవు?

కౌము—సందర్భమే. ఈ యశోకవృక్షము నీడను జూడుము వకుళావళిక మాళవిక కెట్టలంకారము జేయుచున్నదో?

ఇరా—(చూచిసందేహము నభినయించి) ఇట్టి వైభవ మాదాసికెట్లు గలిగినదే? ఓసీ చెప్పుము?

కౌము—ఊయలనుండి పడినందునఁ బాదములునొచ్చిన దేవి యశోకమునకు దోహదముజేయుటకై మాళవికనుబంపి యుండవచ్చునని యూహగలుగుచున్నది.

ఇరా—అట్లుగాదు నాకొక గొప్పసందేహము గలుగుచున్నది.

కౌము—అమ్మా! సందేహమునకేమి యెప్పుడును గలుగుచుండును. రాజుగారిని వెదకుదువా!

ఇరా—నా పాదములు కదులనీయవు. మనసులో గొప్పసందేహము బాధపెట్టుచున్నది. ఏమిసేయుదు (స్వగతము మాళవికనుజూచి) నాకుభీతిగలుగుట చిత్రమే (ప్రకాశము) కౌముదికా! మనమిందే కూర్చుందుము (అట్లుచేయుదురు)

వకు—(అనుగుజూచి) సఖీ! ఈయలంకారము బాగుగానున్నదా?

మాళ—నాకరణమగుటచే లజ్జనొందుచుంటిని. ఈయలంకార మెవరికడ నేర్చితివి?

వకు—ఈ విద్య నాకుపదేశించినది యేలిక.

గౌత—వయస్యా! లేచి తొందరగా గురుదక్షిణ దెచ్చికొమ్ము.

మాళ—ఇట్టినేర్పు గల్గియు గర్వించకున్నందులకు నాకుఁ జాల సంతోషము.

వకు—ఉపదేశానురూపములగుఁ బాదములు దొరకినందులకు గర్వించెదను. (స్వగతము) నాపని తీరినట్లే (ప్రకాశము) సఖీ! ఇప్పటికొకకాలికి లంకరించుట యయినది. దీనిని నోటిగాలిచేతఁ దడియార్పుము. పోనీ ఇక్కడ గాలి బాగుగనే యున్నదిలే.

రాజు—వయస్యా! చూడుము.

కం. తరుణీమణి యార్ద్రాలి
క్తరసముగల పదము నోటి ♦ గాడుపుతోడన్
హరియింపఁగ నీసమయాం
బుగగతిసేవావకాశ ♦ మొసఁగెను నాకున్.

గౌత—రాజా! నీకీ యనుశయమేల? తొందరఁగా నీవును ననుభవింపఁ గలవులే.

వకు—సఖీ! ఎఱ్ఱదామరవలె నీపాదము వెలుగుచున్నది. ఎల్లప్పుడును భర్తయంకభాగమున జేరు సుఖముగాంతువు.

(ఇరావతి నిపుణికను జూచును.)

రాజు—ఇది నాకాశీర్వాదము.

మాళ—చెలీ! అనుచితమాడెదవేల!

వకు—కాదు ఉచితమే.

మాళ—నీకు నేను ప్రియురాలనుగాదా?

వకు—కేవలము నాకేగాదు.

మాళ—మఱియు నింకెవరికి

వకు—గుణానురక్తుఁడగు నేలికకుఁగూడ

మాళ—అసత్యము బలుకుచుంటివి. అదియే నాయందు లేనిది.

వకు—సత్యము. అది నీలో లేదు. కృశించినవియు సుందర పాండురములయినవియునగు మహారాజుగారి యవయవములలోఁ గానఁబడుచున్నది.

ఇరా—(స్వగతము) తొలుత నేననుకొనినట్లే యీచెడిపె పలుకుచున్నది.

వకు—అనురాగము ననురాగముతోఁ బరీక్షింపవలయుననుమాటఁ బ్రమాణముగఁ దలఁపుము.

మాళ—నీయిష్టమువచ్చినట్లెల్ల మాట్లాడెదవా?

వకు—కాదు. కాదు. ప్రణయమృదువులగు భర్తవాక్యములివి. నా ముఖమున వెలువడుచున్నవి.

మాళ—దేవినిఁ దలంచిన నామనసు విశ్వసింపదు.

వకు—ముగ్ధా! తుమ్మెదలు ముసరుకొనునని వసంతకాలమునఁ బుట్టిన చూతప్రసవము నలంకరింపకుందురా!

మాళ—(లజ్జతో) ఏమో నీయిష్టము.

వకు—విమర్ద సురభియగు వకుళావళిక గదా యానీచెలి.

రాజు—బాగు వకుళావళికా! బాగు.

తే॥ భావ మెఱుకపడిన వెన్క ♦ బయలుపడిన
యది తిరస్కారమున యోగ్య ♦ మైన యుత్త
రమిడినదియగు మాటచే ♦ రమణి నిలిపె
నాసతిని కాముకులు దూత్యా ♦ ధీనులుగద.

ఇరా—చూచితివిగదా వకుళావళిక యెట్టికార్యము తలఁపూనినదో?

కౌము—భట్టినీ! తెలియనివారికేని యుపదేశము తెలివిని గల్గించును.

ఇరా—నాసందేహ మిప్పటికి తీరెనది. రహస్యమెఱిఁగి పైసంగతి నాలోచించెదను.

వకు—ఇదిగో నీరెండవ కాలుగూడ నలంకరించితిని. పాదమున కందెఁ దొడఁగెదను. లేచి దేవిగారి నిదేశము నెరవేర్పుము.

(ఇరువురు లేతురు.)

కౌము—దేవిగారి నిదేశమని తెలినదిగదా.

వకు—సఖీ! ఇదే రాగముకలిగి యుపభోగమునకుఁ దగియుండుటఁజూడవా?

మాళ—(హర్షముతో) ఏమీ? భర్తయా?

వకు—కాదు కాదు అశోక శాఖావలంబియగుఁ జిగురుగుత్తి. దీనిని కర్ణమందలంకరించుకొనుము. (మాళవిక విషాదము నటించును)

గౌత—వింటివిగద

రాజా—ఇంతమాత్రము కాముకులకు చోరవజాలును

చ॥ అరయఁ బరస్పరంబగుఁ బ్రి ♦ యత్వము తుల్యముగానివారికే
యిరువుర సంగమంబు లభి ♦ యించినఁగాని గుణంబుగాదు స్త్రీ
పురుషులకుం సమానరతి ♦ పూనికఁ గల్గిన యోనిఁ గోఁడ్లియే
కరణిని గల్గుండునెడఁ ♦ గాల్చుట మేలు శరీరమేనియుం.

(మాళవిక చిగురుటాకు గోసికొని చెవిలో బెట్టుకొని విలాసముగా నశోకవృక్షమును దన్నును.)

రాజు—వయస్య !

చ॥ పొలఁతుక దానిచే శ్రవణ ♦ భూషణమౌ చివురాకుఁ జెంది తా
లలితకరప్రహారము వి ♦ లాసముగా నొసఁగింప సిద్ధముం
బలరెడిఁ దుల్యమౌ వినిమ ♦ యంబున దీనిని గాంచి నన్ను నేఁ
దలఁపఁగ సాహసింతునకృ ♦ తజ్ఞుఁడనై తిసటం చుపేక్ష చే.

వకు—ఇఁక నీయుందు దోషముండదు. దోహదమొనర్చినను పుష్పింప కున్నచో నశోకవృక్షమే నిర్గుణమగును.

రాజు—

చ॥ అలముఖరత్నులాకలక ♦ లారవమున్ విని సజ్జలేజకో
మలమగునట్టి పాదమున ♦ మానిని నిన్ను బహూకరింపఁగా
నలరులఁ జూపవేని వృథ ♦ యాగద చారులతాంగులందునన్
గలిగెడిదోహదంబెచఁ ♦ గాంచినఁగాని యశోకరాజమా ?

గౌతమా ! వచనావకాశము జేసికొని ప్రవేశించెదము రమ్ము.

గౌత—రమ్ము వీరిని బెదరింతము. (ఇరువురు ప్రవేశింతురు.)

కౌము—భట్టినీ ! భర్తగూడ నిక్కడికే వచ్చియున్నాఁడు.

ఇరా—ఇట్లగునని నేనపుడే తలఁచితిని.

గౌత—(మాళవికను గాంచి) ఏమమ్మా ! రాజుగారింటనుండగనే యశోకవృక్షమును గాలితోఁ దన్నుచుంటివే? మంచిపనియా ?

ఇరువురు— (భయముతో) భర్త వచ్చినాఁడే జయమగుగాక !

గౌత—(వకుళావళికను జూచి) ఓసీ ! ఈమె తెలియక యిట్టియనుచిత మొనర్చుచుండ నీవేల వారింపవైతివి.

(కొట్టఁబోవును. మాళవిక భయము నటించును.)

కౌము—భట్టినీ ! ఆర్యగౌతముఁ డేమి ప్రారంభించెనో చూచుము.

ఇరా—ఈనీచుఁ డెట్లు జీవనము చేయుననుకొంటివి ?
వకు—దేవా ! ఈమె దేవిగారియాజ్ఞ నెరవేర్చినది. అట్లుగాకుండుట కస్వతంత్రురాలుగదా ? ఏలినవా రీతిప్పు మన్నింపవేడెదను.

(అని మ్రొక్కి మాళవికచే రాజునకు మ్రొక్కించును.)

రాజు—దేవి యాజ్ఞాపించినచో నాయాజ్ఞ యయినట్లే. దోషము లేదు. భద్రా లెమ్ము. (చేయిబట్టుకొని మాళవికను లేవదీయును)
గౌత—దేవిగారియాజ్ఞ యైనచో ముఖ్యముగాఁ జేయఁపలసినదే !
రాజు—(నవ్వి)

తే॥ అరుణకిసలయకోమల ♦ మైన పాద
తలమునకుఁ బాధకలుగదే ? ♦ తరుణి యిటుల
గఠినమగునట్టి పాదప ♦ స్కంధమునను
దాడనమొనర్చి యింతలోఁ ♦ దలఁప కిపుడు.

(మాళవిక సిగ్గు నభినయించును.)

ఇరా—ఆర్యపుత్రుని హృదయ మెంతమార్దవము గలది.
మాళ—వకుళావళిక ! రమ్ము తమనియోగ మొనర్చితిమని దేవితో విన్నవింతము.
వకు—సెలవీయుమని ముందుగ భర్తను వేడికొనుము. (రాజును జూచి) మహారాజా ! మాసఖి యేదో విన్నవింపఁదలచుచున్నది.
రాజు—కళ్యాణీ ! వెళ్ళవచ్చునులెమ్ము. అవసరమైన యీయభ్యర్థము వినుము.
వకు—సఖీ ! నిశ్చలచిత్తవై వినుము. మహారాజా ! ఆజ్ఞాపింపుడు.
రాజు—తే॥ అలరులుగలాఁడైయైన న ♦ నన్యనిరతుఁ
డగునితనికిఁ జిరమునుండి ♦ యాలరుగల్గ

దంబుజాననస్పర్శాస్పృ ♦ తంబుచేత
దోహదంబొనరింపు డు ♦ తూహలమున.

ఇరా—(తటాలునవచ్చి) ఈ కాంచనాశోకము పుష్పలమాత్రమే యొసం
గును. ఆర్యపుత్రుండైతే ఫలముగూడ నొసంగును. ఆలస్య
ము చేయక దోహదము జేయుము. మాళవికా! చేయుము.

(అందరును ఇరావతి గాంచి భయమునటింతురు.)

రాజు—(గౌతముని గాంచి) వయస్యా! ఇప్పుడు గతియేది?
గౌత—వేరేమి కలదు. పిక్కబలిమియే.
ఇరా—బాగుబాగు వకుళావళికా! బాగు. (మాళవికను గాంచి)
ఆర్యపుత్రునకు దోహదము జేయవేల? నీకు భయమెందులకు!
వకు—(భయముతో) భట్టినీ ఏలినవారి ప్రణయముగోరమేమెంత
వారము. దేవిగారియాజ్ఞ నెరవేర్చుటకై వచ్చితిమి. క్షమిం
పుము (ఇరువురు నిష్క్రమింతురు)
ఇరా—పురుషులవిశ్వసింపగూడదని తెలియక వేటకానిసంగీతమువిని
డాయవచ్చిన లేడివలె నాయాత్మ వినాశము నేనే జేసికొంటిని.
గౌత—(జనాంతికము రాజునుగాంచి) ఇప్పుడేదేని తగిన సమా
ధానము జెప్పుము. సీల్లునమిలెద వేని దారిలేనిసీటిదగ్గరి చిక్కిన
దొంగవలె నగుదువు.
రాజు—(ఇరావతినిగాంచి) సుందరీ! నాకు మాళవికతో బనిలేదు
నీరాక యాలస్యమగుటచేత నేదోవిధముగ గాలము గడప
వచ్చునుగదా? యని తలంచితిని.
ఇరా—ఆర్యపుత్రునకిది వినోదస్థానమని యెఱుంగను ఎఱుంగున నేని
మీస్వేచ్ఛకు భంగము కల్గింతునా?
గౌత—హఠాత్తుగా నంతఃపుర పరిజనము గానవచ్చిన మాట్లాడుట
దోషమా? నీవే చెప్పుము. వృథాగా రాజుగారి ప్రణయము
నేల జెడగొట్టుకొందువు. అనుమానము పనికిరాదు.

ఇరా—(కోపముతో) కానిండు ఈసంభాషణమే జరుగునుగాక, నాకీ వృథాయాస మెందులకు. (వెళ్ళఁబోవును.)

రాజు—(వెంబడించి) సుందరీ! దయయుంచుము. పోక నిలువుము.

(ఇరావతి మొలనూలు కాళ్లకుఁ దగుల్కొనఁబోవుచుండును.)

రాజు—ప్రణయముగలవారియెడ నిట్టి కాఠిన్యము తగునా?

ఇరా—శఠా! నమ్మదగినవాఁడవు కావు. చాలు నీమైత్రి.

రాజు—

చ. అలికులవేణి యీపరిచ ♦ యంబుగలట్టి సఖున్ శఠుండుగాఁ
దలఁచి తిరస్కరించుట యె ♦ దన్దగుగాని పదాగ్రలంబియై
యలమొలనూలువచ్చి యిటు ♦ లారసి నిన్ బ్రతిమాలుకొన్న నీ
కలిగిన కోపమున్ విడవు ♦ గా యిది న్యాయమే నీకుఁగోపనా?

ఇరా—ఈమొండి మొలనూలుగూడ నావెంటనే వచ్చుచున్నదే?

(అని మొలనూలుతో రాజును గొట్టబోవును.)

రాజు—ఆహా యీయిరావతి

ఉ. కన్నుల బాష్పవర్షమధి ♦ కంబుగ వెల్వడఁగన్ నితంబ బిం
బోన్నతభాగము న్విడచి ♦ యుర్విపయిన్ బడుగాంచితోడ నే
కన్నియ నన్ను గొట్టుటకుఁ ♦ గాఁదలఁపూనెను వింధ్యపర్వతం
బున్నవవారిదంబుగతిఁ ♦ బూనికతోడ వయస్య కాంచితే.

ఇరా—ఇంకను నన్ను పరిభవించెదవా? (అని చేయిలాగుకొనును.)

రాజు—సీ. అసమకుంతలయపరాధి ♦ నైన నన్ను
దండనమొనర్చుటనుమాని ♦ దయదలిర్ప
విలసనం బెంతయెంతయో ♦ వృద్ధిజేసి
దాసజనమును గోపింపఁ ♦ దగునె యిటుల.

ఇఁకనైన నీకోప ముపసంహరింపుము. (అని పాదముల బడును.)

ఇరా—ఇవినీకు స్పర్శరూపమగు దోహదముజేయ మాళవికా పదములు గావు. (అని నిష్క్రమించును.)

గౌత—లెమ్ము మిత్రుడా! లెమ్ము. నీయందామెకు దయ రాలేదు. మన చేసినపని యామెకుఁ దప్పుగ దోఁచినదేమొ?

రాజు—(లేచి) ఇరావతిని గానక) గౌతమా! నాప్రియ వెడలినదా?

గౌత—ఆ వెడలినది. నీయదృష్టము మంచిదిగాన యెట్లోవిడచి పోయినది. తొందరగా దేవిగారి సన్నిధికిఁ బసుగొందము. రమ్ము. అంగారకుఁడు రాశిలోనికివలె మరలవచ్చి పడునేమో?

రాజు—అహో! మదనుని వైషమ్యము.

కం. లలనా హృత హృదయుఁడనై
తలఁచెద సేవయని మ్రొక్క ♦ దయఁగొనకుంటన్
గలదయ్యుఁగూర్మి నాపయి
చెలి కుపితయగుట నుపేక్ష ♦ జేసెనటంచున్.

కావున రమ్ము. ఇరావతిని లాలింతము.

గౌత—అట్లే నమ్మకొనుము. (ఇరువురు నిష్క్రమింతురు.)

(యవనిక జారును.)

(ఇది తృతీయాంకము.)





# మాళవికానాటకము.



## చతుర్థాంకము.

[ తరువాత రాజును వృద్ధకంచుకియుఁ బ్రవేశింతురు. ]

రాజు—(స్వగతము)

చ॥ అలమ్మృదువైనపేరు విన ♦ నాశయునర్దగుఁ బాదుగల్గి క
న్నులఁ గనరాగపల్లవ వి♦నూతనమై చెయిదాకునర్మనం
బలరెడిపుల్కలన్ సుమము ♦ లంది తలోదరి యాశ్రయంబునన్
జెలఁగడి కామవృక్షమతి ♦ శీఘ్రముగన్ ఫలియించుఁగావుతన్.

(ప్రకాశముగా) వయస్యా! గౌతమ!

కంచు—దేవ! జయమగుగాక గౌతమయ్య యింగు లేఁడు.

రాజు—ఆ! మఱచితిని మాళవికావృత్తాంతమరయుటకై పంపితిసిగదా!

( తరువాత గౌతముఁడు ప్రవేశించును. )

గౌత—(రాజునుజూచి) వయస్యా! సఫలీకృత మనోరథుఁడవుగమ్ము.

రాజు—(కంచుకినిజూచి) జయసేనా! పాదములు నొవ్వకుండ దేవి
యెక్కడవినోదముగాఁ గాలముగడుపుచున్నదో చూచిరమ్ము.

కంచు—చిత్తము. (నిష్క్రమించును.)

రాజు—వరారోహయగునా చెలి మాళవిక సంగతినేమి తెలిసికొంటివి.

గౌత—ఆమెకు గండుబిల్లి నోటఁబడిన చిలుకకూనగతి పట్టినది.

రాజు—(విషాదముతో) అయ్యో! ఎందువలన?

గౌత—ఆదీనురాలిని దేవిగారు పాతాళలోకమున బంధించుటవలన

రాజు—(ఆతురతతో) ఏమీ? నన్ను ప్రేమించినదనియా? అకటా!

సీ॥ స్వర్ణ హర్మ్యంబయ్యె♦సరసిజాననకుండ
రానట్టి చెనటి కా♦రాగృహంబు
ప్రాసాదవనమయ్యె♦నా సుందరాంగికిఁ
దలఁపఁగరాని పా♦తాళవసతి
చెలిమికత్తియలైరి♦పొలఁతులతలమిన్న
కూడిగంబొనరించు♦నువిదలెల్ల
దలమానికములయ్యె♦ధరణీశుతనయకుఁ
బరులసామాన్యంపుఁ♦బలుకుల
యకట నిరతంబు వివిధసౌ♦ఖ్యములఁ జెందఁ
దగిన యా లేతఁకూనకుఁ♦దగనియట్టి
దిక్కుమాలిన యిడుములు♦పెక్కుగల్గె
భాగధేయంబునకు వేరు♦పాటుకలదె.

గౌత—అవును నిన్ను ప్రేమించినదనియే.

రాజు—దేవికీవిషయ మెవరెఱింగించిరి?

గౌత—మొదటనుండియు జరిగిన కథజెప్పెదనువినుము. కాలినొప్పి యెట్లున్నదని దేవినడుగుటకై యిరావతి వెళ్లినదని భగవతి నాతో జెప్పినది.

రాజు—మంచిపనియేగదా? తరువాత

గౌత—తరువాత "ప్రియుండుగానవచ్చెనా?" అని దేవియడుగ నెక్కడి ప్రియుఁడు ప్రియుత్వమెల్లఁ బరిజనముపాలైనది." అని యిరావతి పలికెనట.

రాజు—ఈప్రస్తావనము నిర్ధారణ లేకున్నను నాచెలి మాళవికను గూర్చినదనియే సందేహమగుచున్నది. తరువాత

గౌత—తరువాత దేవియడిగినకాలంది మనచేసినపని నంతయుఁ జూస గుచ్చినట్లిరావతి చెప్పినదట.

రాజు—ఏమీ ! అసూనవతికి దీర్ఘరోషము ? తరువాత జరిగినది కూడవినిపింపుము.

గౌత—ఇంక వినపింపదగినదేమి కలదు. కోపాతిశయంబున దేవి యంధకార బంధురమైన పాతాళ గృహమున వకుళావళికను మాళవికను బంధించినది.

రాజు—ఎంతకష్టమెంతకష్టము.

తే॥ ప్రవిమలస్వరము గలట్టి ♦ పరభృతంబు
షట్పదంబును బాలర ♦ సాలనిరతిఁ
జెలఁగియు నఖండవాయువు ♦ గలయుకాల
వర్షముసఁ జెట్టుతొఱ్ఱలో ♦ పల వశించె.

ఈ కష్టసాగరమీఁద నేదేని యుపాయముఁ జేయ నవకాశ ముండునా ?

గౌత—ఎట్లుండును ? నాయంగుళీయకము జూడక నీహతాశలవిడువకు మని దేవినిధిపాలికయగు మాధవికతోఁ గట్టిగాఁజెప్పినది.

రాజు—(నిట్టూర్పు విడచి) అక్కటా నన్నుగోరినందులకా యిందు వదన డెందంబున కానందము లేకున్నను గడుంగడుభరింపరాని యిక్కట్లుమాత్రము గల్గెనా ? సంతతచారుసౌధోపరి భాగం బులఁ గాంచనడోలికలఁ బరిచారికా సహస్రముసేవింప సుఖంబుగఁ గాలంబుఁగడుపఁదగిన మగువకా యిట్టియంధకార బంధురమై తరణి కిరణముల నేని జొరనీయక భయంబుఁగొల్పు పాతాళలోకంబు నివాసయోగ్యంబగుట. ఎట్టినిర్దయురాలవే? ధారిణీ ! ఇట్టి వెతలఁ గుసుమపుటకా నీయున్న యాకన్నెమిన్నను నీకడపంపినది ? కొప్పులో బెట్టుకొనఁదగిన చేమంతిపూల బంతిని మెడమకాలితోఁ దన్నితివా ? వీరసేనా ! జిలిబిలి

పలుకులచే మనంబలరారుసట్లు జేయుచిలుకకూనను పసిండి పంజరమని తలంచి గండుబిల్లినోటఁ దాచితివా ? హాప్రియా ! ఇంకనీవు నాకగపడవా ? ఈసీదాసునిగూడ నీకడఁ జేర్చుకొనఁగూడదా ? (గౌతముని జూచి) ఈనిర్భాగ్యుని మూలంబుసఁగష్టపరంపరఁజెందు నాహృదయేశ్వరిని రక్షించుట కుపాయ మాలోచించి నాప్రాణముల నిలుపుము. లేదేని నీమిత్రుఁడు నీకగపడుట దుర్లభము.

గౌత—ఆలోచించి యుపాయమేలఁగలుగక గపోవునుగాని దేవియెఱిఁగినచో నాకును నట్టిగతియే కలుగునేమోయని భయపడెదను.

రాజు—అట్లని నీ వుపేక్షించిన నాప్రాణములు నిలుచునా ? ఆ యబలకు నీకన్న వేరెవరుదిక్కు.

గౌత—(ఆలోచించి) కానిమ్ము పరోపకారముగదా కావలయును. నాకొకమంచిమార్గము దొరికినది. (అంతటను గలయఁజూచి) ఎవ్వరైనఁ గనుబడకపిందురేమో ! ఇది గొప్పరాహస్యము. (చెవులోచెప్పును).

రాజు—బాగుకార్యసిద్ధికై యిట్లేచేయుము.

కంచు—(ప్రవేశించి) జయము మహారాజా ! దేవిగారు తెల్లమేడలో పక్కపైపడుకొని యెఱ్ఱగంధము పన్నీరు కాలికిబూయఁబడియుండ భగవతి చెప్పుకథలు వింటూ ప్రొద్దు గడుపుచున్నారని ” రదసిక చెప్పినది.

రాజు—నాకును ప్రణయము ననుభవింప నిదియే సమయము.

గౌత—మీరు దయచేయుఁడు. దేవిగారిని దర్శించుటకు రిక్తహస్తుఁడనుకదా ! ఏదేని యొక ఫలముగొని వెంటనే వచ్చెద.

రాజు—దీనిని జయసేనునకుఁగూడ చెప్పి పొమ్ము.

గౌత—అవును. అవసరమే. ఓరీ ! జయసేనా ! (చెవిలో చెప్పి) జాగ్రతసుమీ ! (నిష్క్రమించును.)

రాజు—జయసేనా ! స్ఫటికసౌధమునకు మార్గము జూపుము.

కంచుకి—దేవ ! ఇటుఇటు. (ఇరువురు నిష్క్రమింతురు.)

(తరువాత శయ్యాగతయగు ధారిణియు నెదురుగ పీటపై కూర్చొని పరివ్రాజికయు ప్రవేశింతురు. స్ఫటికశిలాభవనము)

దేవి—భగవతీ ! కథ బాగుగా నున్నది. తరువాత.

పండి—తరువాత సామంతరాజు లెల్లరు సేవించుచుండ (చూపునిగిడించి) ఇదిగో విదిశాధిపతి. నీకుశలము విచారించుటకుం గాంబోలు వచ్చుచున్నాఁడు.

(తరువాత అగ్నిమిత్రుఁడు ప్రవేశించును)

దేవి—(చూచి) అవును. అదుగో ! ఆర్యపుత్రుఁడు.

(లేవఁబోవును.)

రాజు—చాలుచాలు. ఈయుపచారమునకై యాయాసపడకుము.

తే॥ లలితమృదువాణి ! నూపుర ♦ లలితమగుచు
జాఁబవాపీటపై యిట్లు ♦ ప్రేలునీదు
నొప్పిగల పాదమును నన్ను ♦ నొవ్వఁజేయఁ
దలఁపఁబో కిపుడీసేవ ♦ సలిపి నాకు.

దేవి—ఆర్యపుత్రునకు జయమగుఁగాక.

పండి—దేవ ! జయము గాంచుము.

రాజు—(భగవతికి నమస్కరించి ధారిణిని గాంచి) దేవీ ! బాధ సహింపఁదగియున్నదా ?

ధారి—మునుపటికన్న నించుక గుణముగ నున్నది.

(తరువాత జన్నిదమును వ్రేలికిఁ జుట్టుకొని గౌతముఁడు ప్రవేశించి) అయ్యో ! రక్షింపుము. రక్షింపుము. నన్ను నాఁగుబాము కఱచినది.

రాజు—ఆ! పాముకఱచెనా? అయ్యో గౌతమా! ఇంతకుముందు నావద్దనే యుంటివే? ఇంతలో నెక్కడకుఁ బోతివయ్యా!

(అందరు విషణ్ణులగుదురు.)

గౌత—(గద్గదస్వరముతో) దేవీ! దేవిగారిని దర్శింపఁదలఁచి యాచారముచొప్పున నేదేని యొక ఫలముదెత్తునని ప్రమదవనమున కేగితిని.

ధారి—కట్టా! పాప మీ బ్రాహ్మణుని ప్రాణభయమునకు నేనే కారణమైతినా?

రాజు—అక్కడ నేమయ్యెను?

గౌత—అక్కడ నేచెట్టునఁ జూచినను పండ్లు చేతి కందకుండుటచేత పువ్వునైనఁ గోసికొందునుగదా యనియెంచి యశోకపాదపమునఁ గుడిచెయ్యి జాచి వ్రేలాడుచున్న పూలగుత్తిని గోయఁబోవునంతలో చెట్టుతొఱ్ఱలోనుండి యొక భయంకరమగు త్రాఁచుబాము వచ్చి తన వాడికోరలతో బలవంతముగఁ బీకినది. ఇవిగో యీ వ్రేలికి రెండుగాయములు గలిగినవి.

(అనిచూపి యేడ్చును.)

రాజు—(భగవతిని జూచును.)

భగ—తే॥ సర్ప మెచ్చోటఁగఱచు నా ♦ స్థలమునందుఁ
గాల్చుటయొ గంటునుండి ర ♦ క్తంబు వెడలఁ
దీయుటయొ దాని నఱకుట ♦ యో గొనర్ప
వలయు నాతని ప్రాణముల్ ♦ నిలుపుటకయి.

రాజు—జయసేనా! ధ్రువసిద్ధిని వేగముగాఁ బిలిచికొనిరమ్ము.

కంచు—చిత్తము. (నిష్క్రమించును.)

గౌత—అయ్యో! అయ్యో. నాకీపాపపు మృత్యువెచ్చటనుండి దాపరించెను. పెండ్లి పేరంటములు లేకున్నను భాగ్య భోగ్యములు

లేకున్నను నెక్కడనో బ్రాహ్మణార్థములుచేసి డొక్క నింపుకొని బ్రతుకనీయక హతవిధి నాప్రాణములనే నిష్కారణముగ దీయఁదలఁచెనా! ఇఁక నేను బ్రతుకజాల. మహారాజా! దిక్కులేని యీబక్కబాపని రక్షింతునని కొండంత యాశతో వచ్చి చేరితిని. నాకై యించుక శ్రమతీసుకొనక నీప్రియాజనముతో మాట్లాడుచు నాగతి విచారింపవైతివేమి? (దేవిని గూర్చి) అమ్మా! ఈదరిద్రుఁడు చచ్చినను జావనిమ్మని తలంచితివా? నాప్రాణములు నిలుచునట్లు లేదు. రక్షింపుము. రక్షింపుము.

రాజు—గౌతమా! భయపడకుము. పాముకాటున కొకప్పుడు విషముండదు.

గౌత—ఎట్లు భయపడకుందును. విషమెక్కి నాయొడలెల్ల జెమ్మగిల్లుచున్నది నోట చొంగ వచ్చుచున్నది. (విషవేగము నటించును.)

ధారి—ఈతఁడు విషవేగముచే వణకుచున్నాఁడు. పట్టుకొనుఁడు.

(పరిజనమట్లుచేయును.)

రాజు—భయపడకుము. వైద్యుఁడు త్వరలో చికిత్సఁజేయును.

కంచు—(ప్రవేశించి) దేవ! ధ్రువసిద్ధి గౌతముని నటకే తీసుకొని రమ్మనుచున్నాఁడు.

రాజు—అట్లయిన మెల్లగా గౌతమునిఁ దీసికొని పొమ్ము.

గౌత—(ధారిణినుద్దేశించి) అమ్మా! నేను బ్రతికినను బ్రతుకకున్నను రాజుగారి సేవకుఁడనుగాన నా యపరాధమేదేనియున్న క్షమింపుము. (రాజునుద్దేశించి) అయ్యా!

ఉ. కన్నులుగానరామి కొడు ♦ కా! యని నోచ్చుచు నించుకేని న
న్నెన్నఁడుబాయనట్టి జన ♦ యిత్రి జరాపరిపీడితాంగయై
యున్నది దిక్కులేక యహీ ♦ యోగమునన్ మృతుడైతి నేని నే
నున్నపుడెట్లొ యట్లు దయ ♦ యుంచఁగదయ్య నృపాల యమ్మపై.

(భగవతివంకఁజూచి) భగవతీ! నన్ను (అని) ఇఁక మాట్లాడ లేను కన్నులు పచ్చబడుచున్నవి. తల దిరుగుచున్నది.

(క్రిందబడును.)

ధారి—(జాలితో) జయసేనా మెల్లగా గొనిపొమ్ము.

కంచు—జయమగుగాక. (గౌతముని భుజముపై వేసికొని పోవును.)

రాజు—దేవీ! దీనుఁడగు నీ బ్రాహ్మణుఁడు స్వభావముచేతఁ బిఱికి వాఁడు. ధ్రువసిద్ధి సార్థకనాముఁడై నను విషముతగ్గి గౌత ముఁడు జీవించునని ధైర్యములేదు. అయ్యో! అపవాదు గలుగునేమో కదా?

భగ—(పాపముశమించునుగాక!)

కంచు—(ప్రవేశించి) దేవ! నీటికడవలో వేసి చికిత్సఁ జేయుటకు సర్ప ముద్రగల యుంగరము కావలయునని ధ్రువసిద్ధి విన్నవించు చున్నాడు.

ధారి—ఇదిగో యుంగరము పని దీరినవెంటనే తీసికొనిరమ్ము.

(ఇచ్చును.)

కంచు—(నిష్క్రమించును.)

భగ—రాజా! గౌతమునకు విషవేగముతగ్గి సుఖముగ నున్నట్లు తోఁచు చున్నది.

రాజు—అట్లే యగుఁగాక.

కంచు—(ప్రవేశించి) దేవ! గౌతమయ్యకు బాధ తగ్గి క్షణములో నెప్పటియట్లయయి సుఖముగా నున్నాఁడు.

ధారి—అదృష్టవశమున నపవాదమునుండి బైటఁ బడితిని.

కంచు—మఱియు నాలోచింపవలసిన రాచకార్యములు చాలకలవు. అందువలన దేవర పరిజనము ననుగ్రహింపవలయున"ని యమా త్యులవారు ప్రార్థించుచున్నారు.

ధారి—కార్యసిద్ధికై యార్యపుత్రులరుగుదురుగాక.

రాజు——దేవీ! ఇంక నీవంతిపురమునకు బొమ్ము ఇక్కడ గాలి యెక్కు వగా నున్నది. (దేవియు భగవతియు నిష్క్రమింతురు.)

రాజు——జయసేనా! రహస్యమార్గము నుండి పాతాళ భవనమునకు దీసి కొనిపొమ్ము.

కంచు——చిత్తము దేవ! యిటు యిటు రహస్యమార్గము.

(నడచుచుందురు.)

రాజు——గౌతముని కృత్యము నెరవేఱియుండునా?

కంచు——ఆ నెరవేఱినది.

గౌత——(ప్రవేశించి) వయస్యా! ఇంకను మెల్లగనె నడచుచుంటివా? రమ్ము రమ్ము.

రాజు——గౌతమా నీపనిసంపూర్ణమైనదా?

గౌతమా——మహారాజా!

తే॥ ఇష్టఫలముజెంద ♦ నేకాంతసాధ్యమౌ
సల యుపాయమిదియ ♦ యనుచుఁ దెలసి
కార్యసిద్ధిగూర్చి ♦ కలిగెడిసందేహ
మకట భయముజెందు ♦ నట్టిసీకు.

రాజు——ఇప్పటికి క్లిష్టమైనది. (కంచుకినిజూచి) జయసేనా! నీవు నీపని జూచుకొనుము. (కంచుకి నిష్క్రమించును)

(గౌతమునిగాంచి) గౌతమా! మాధవిక యీవిషయమై యేమియు విచారింపలేదా?

గౌత——అనుల్లంఘ్యమగు దేవిగారి యంగులీయకము జూచినదికదా. ఏలవిచారించును.

రాజు——ముద్రనుగూర్చి నేనడుగను కాని వీరల విడుచుటకేమికారణ మని యాపె యడుగవలసి యుండెను.

గౌత—ఆ. అడిగినది. మందబుద్ధిగలవాఁడనై నను నేనప్పటికిఁదోఁచి నట్టు లీవిధముగఁ జెప్పితిని. ఏమందువా? "దైవజ్ఞులు మహారాజుగారి నక్షత్రము దుష్టగ్రహసంకులమైనదని చెప్పుట వలన దేవిగారు బందీలనెల్లను విడుదల జేయింపదలఁచి వీరల విడువ నన్నుబంపెనని చెప్పితిని.

రాజు—(గౌతముని కౌఁగలించుకొని) వయస్యా! నీకు నేనుమిత్రుఁడను గదా?

తే॥ కలుగుదురు మిత్రులెందఱో ♦ కాని కార్య
సిద్ధిమార్గంబుఁ గనిపెట్టి ♦ చెలిమితనము
సార్థకముచేసికొననేగ నీ ♦ సాటివాఁడు
కలుగునె యొక్కఁడేనియుఁ ♦ గానిసఖుండా.

ఉ॥ ఏరుచిరాంగికై యిటుల ♦ నింతటి వంతలఁగుందుచుంటినా
కారమణీలలామఁ గల ♦ యంగల మార్గమెఱుంగఁజేసి మే
ల్గూరిచినాఁడ వీవిపుడ ♦ కుంఠితమౌ భవదీయశక్తినే
నేరుతునే గణించుటకు ♦ నెచ్చెలికాఁడ! యొకింతయేనియున్.

గౌత—వయస్యా! ఇందునాచాతుర్యమేమికలదు. మనీషావంతులగు దేవరమైత్రియే యింతకుఁగారణము. ఈపొగడికలకేమిగాని యాలస్యముచేయక రమ్ము. పాతాళభవనములో మాళవికయు వకుళావళికయు నీకొఱకై వేఁచియుందురు.

రాజు—ఇదిగో నామనోహారిని గలయ నువ్విళ్లూరుచున్నాను. ముందు నడువుము.

గౌత—ఆ రమ్ము (పరీక్షించి) ఇదే పాతాళగృహము.

రాజు—(ముందుజూచి) అదుగో నీసఖి యిరావతి పరిచారిక చంద్రిక యిటేవచ్చుచున్నది. దానికిగనబడకుండ నీగోడచాటున దాఁగుదము.

గౌత—అవును జారులకుఁ జోరులకుఁ జంద్రికపనికిరాదుగదా ?

[ ఇరువురు నట్లే చేయుదురు. ]

రాజు—గౌతమా! నీచెలిమాళవిక నాకొఱకెట్లైనరు చూచుచుండునో యీకిటికీనుండి చూతమురమ్ము. (చూచుచుండును.)

తరువాత మాళవికయు వకుళావళికయుఁ బ్రవేశింతురు[పాతాళభవనము]

వకు—సఖీ! నీమనోహరునకు నమస్కరింపుము.

మాళ—(సిగ్గు నభినయించుచు చేతులతో నమస్కరించును.)

రాజు—వయస్యా! నాచిత్రపటమునుజూచి పలుకుచున్నదని తలంచెదను

మాళ—(ద్వారమువైపుజూచి) సఖీ! నన్ను మోసము చేయుదువా ?

రాజు—నాచెలిహర్ష విషాదములకు మెచ్చితిని.

తే॥ అర్కుఁడుదయింప నస్తమ ♦ యంబునొంద
జలజమునకే యవస్థలు ♦ సంభవించు
నాయవస్థలు రెండొక్క ♦ యదనుసండె
కామినీమణి మోమునఁ ♦ గానఁబడెడి.

వకు—అదేమీ ? చిత్రపటమున రాజుగారులేరా ?

మాళ—ఇప్పుడు చిత్రపటమునఁ బతినిగాంచుటచేతఁ గలిగినంత సంతోషమప్పుడు ప్రత్యక్షముగ గాంచినను గలుగలేదు. అంతటిభాగ్యమా ?

గౌత—వింటివిగదా మిత్రుఁడా ! అప్పుడు నీవు తనివిదీరఁ జూచినట్లు నిన్నామె చూడలేదట. ప్రస్తుతము నీవుపెట్టెలోనున్న రత్నాలంకారమువలె యవ్వన గర్వమూనుటవలన లాభమేమి ?

రాజు—ఓకీపిచ్చివాఁడా ! ఆసక్తిగలిగినను స్త్రీజనము సాహసించునా?

తే॥ తొలి సమాగమమున ♦ వలపునుజెందిన
పతులఁ బోయుగంబు ♦ భావమునకుఁ

దనివి దీరఁజూచి ♦ ననుగాని చెలులకు
వారిపైన దృష్టి ♦ బారదెవుడు.

మాళ—ఇదిగో ! నామనోహరుని పార్శ్వమున నిరావతి. ఎల్లరాణి వాసములను విడిచి యొకదానియందే యనురాగము గలవాఁడుగఁ గనఁబడుచున్నాఁడు. ఈయన యదక్షిణుఁడా యేమి?

వకు—(స్వగతము) ఈవేల చిత్తరువులోని యాకృతిని నిజమని తలఁచి యసూయపడుచున్నది. ఈమెను కొంచెె మాడించెదను. (ప్రకాశ) సఖీ ? ఏలినవారి కీమె ప్రియురాలుగదా !

మాళ—అయినచో నాకీ వృథాయాస మెందులకు ? (మొగము త్రిప్పును.)

రాజు—వయస్యా ! చూడుము.

మ॥ చెలిభ్రూభంగముతోడ బొట్టుచెదరఁ ♦ జన్నారి మోవిఁ స్ఫుర
చ్చలనంబొంద నసూయతో విముఖయై ♦ చందంబు గాన్పించుఁగాం
తులపై తత్కృతరోషసంజనితచే ♦ తోరుట్కృ్రియఁ దెల్పఁగా
లలితాచార్యుఁడు బోధజేసెడి కలా ♦ లావణ్యశిక్షన్ బలెన్.

గౌత—ఈమె ననునయించుటకు సంసిద్ధుఁడవుకమ్ము.

మాళ—పూజ్యుఁడగు గౌతముఁడుగూడ నిక్కడనే యున్నాఁడే.

(వేరుచోటికి పోబోవును.)

వకు—(అపవారించి) ఇప్పుడు నీవు కోపించితివా లేదా ?

మాళ—నాకుఁ గోపమువచ్చినదని తలఁచెదమో ? చూడుము నాకోపము చల్లారినది. (చిరునవ్వునవ్వును.)

రాజు—(సమీపించి)

తే॥ చిత్తరువునందు గలిగిన ♦ చేష్టఁగాంచి
యంబుజానన నీకుఁగో ♦ పంబదేల ?

నితరులకుఁ జెందరాని నే ♦ నతిముదమున
దాసుఁడ నగుచునుండఁ బ్ర ♦ త్యక్షముగను.

వకు—దేవ! నమస్కారము జేసెదను.

మాళ—(స్వగతము) ఏమిదీ! చిత్తరువునందలి భర్తపై కోపగించితిని?

గౌత—వయస్యా! నీ వుదాసీనునివలె నగుపడెద వేల?

రాజు—ఈతగుణి నమ్మదగనిదగుటచేత.

గౌత—పాప మీలేమ నమ్మదగనిదా? అట్లు దలంపకుము. ఆమె ముగ్ధగదా?

రాజు—వినుము.

చ॥ నయనపథంబున న్నిలచి ♦ నన్గనియుక మాయమౌఁగర
ద్వయమునఁజిక్కి కౌగిట ము ♦ దంబునఁజేర్పఁగ బారిపోవునీ
వయసుది స్వప్నమందు మఱి ♦ బారికి నోర్వక యుందు నేను ని
శ్చయమని దీనిపొందెటుల ♦ స్వాంతమునందు దలంతు మిత్రుఁడా!

వకు—పలుమారు లీయనను మోసగించితి వని చెప్పుచున్నాఁడు. కావున భర్త కెల్లన నమ్మకము గలిగింపుము. ఆలసింపకుము.

మాళ—సఖీ! మందభాగ్యనగు నాకుఁ గలనేని యీలావణ్యరాశి కూటమి కలుగునా?

వకు—దేవ! దేవరయే యీమెకు ప్రత్యుత్తర మొసఁగవలయును.

రాజు—తే॥ కలికి! యుత్తరమేల నీ ♦ పొలఁతికిప్పు
డలరు మదనాగ్నిసాక్షిగ ♦ నాత్మనిడితి
ననిశమేకాంతదాసుఁడ ♦ నగుదుగాని
యండజాక్షికి నేను నే ♦ వ్యుండగాను.

వకు—అనుగ్రహింపఁబడితిని.

గౌత—(ఆతురతతో) వకుళావళికా ! ఈతరుణాశోకపల్లవంబులఁ దినుటకై లేడిపిల్ల పొంచియున్నది. దాని నావలకుఁ గొట్టి వత్తుము రా.

రాజు—ఇట్లే మా యుద్యమమును రక్షించుటకై జాగరూకుఁడవై యుండుము.

గౌత—గౌతమున కిదియుఁగూడఁ జెప్పవలయునా? (పరిక్రమించును.)

వకు—(జనాంతికము) గౌతమయ్యా ! నేనాస్తంభముచాటున దాఁగెదను. నీవీవాకిలి గాయుచుండుము. (వకుళావళిక నిష్క్రమించును.)

గౌత—(పరిక్రమించి చూచి) ఇదే స్ఫటికశిలాఖచితమగు ద్వారము. ఇచ్చట గూర్చుండెదను. (అట్లుజేసి) ఆహా ! దీని స్పర్శ యెంత చల్లగా నున్నది. (అని నిద్రించుట నటించును.)

(మాళవిక భయమున నిలుచియుండును.)

రాజు—సుందరీ !

తే॥ చిరము నీసంగమంబును ♦ జేయఁగోరు
నా యెడఁ గూటమి భయంబు ♦ బాయఁదగదె
నేను సహకారుఁడనగుదు ♦ పూని నీవు
మాధవీలతవుగఁగమ్మ ♦ మగువ! యిపుడు.

మాళ—నాథా ! దేవిగారిని గాంచిన నాకు భయముగలుగుచున్నది.

రాజు—తరుణీ ! భయపడకుము. నేనుంటిఁగదా ?

మాళ—ఇప్పుడు నాకు భయము దీర్చునట్టి యేలినవారి ధైర్యము నిరావతిమోల నప్పుడు జూచితినిగదా ? మరలఁ జెప్పనేల ?

రాజు—(నవ్వి) చిరకాలానురక్తుఁడనగు నాయందు నీ కుదాసీనత యేల ?

(కౌగిలింపఁబోవును. మాళవిక పరిహరించును.)

రాజు—(స్వగతము). నూతనదంపతులు మదనకేళికి దిగునాచారము కడు రమణీయము.

చ॥ చెలిమొలనూలు వీడుపఁగ ♦ జేయి నివారణ జేయుఁగాపయై
బలిమిని కౌఁగలింపఁ జను ♦ బంతులఁ జేతులఁ గోడనద్దు నీ
నెలమిని మోవి గ్రోలుటకు ♦ నెత్తిన మోముటు ద్రిప్పునై ననా
వలపిసుమంతఁ దీరుగతి ♦ వ్యాజమునన్ సుఖియింపఁ జేయుచున్

(ప్రకాశము) తరుణీ! ఈదాసుని గటాక్షింపుము. నేనునీవాఁడను.

మ॥ తరుణీ! సిగ్గువడంగనేమిటికి లే ♦ దా? నాపయిన్గూర్మి దు
ర్భరపంకేజశరాంబకావళికిఁ ద ♦ ప్తంబైన యీ మేనునిన్
శరణంబందెడి నిందుఁగాంచనలతా ♦ సంకీర్ణలీలాగృహా
గ్రరసాలంబులనీ సీతలకర ♦ స్పర్శంబొనర్పంగదే?

(చేయిబట్టుకొని) బాలా! నాకతనఁగదా యీయవస్థనీకుఁగల్గినది? నానేరము సైరింపుము.

సీ॥ ముద్దులుగుల్కునె ♦ మ్మోము మిత్రునిబాయు
బంకజమువిధంబు ♦ వాడిపోవ
కమ్మనియధర బిం ♦ బమ్ము రాలినదొండ
పండురీతిని మెత్త ♦ బారియుండ
మధురంబులగు జిన్ని ♦ మాటలు బంధింపఁ
జిలుకమాడ్కిని జాలి ♦ గొలుపుచుండ
వాలుజూపులువలఁ ♦ బడికదలనిచేప
లవిధంబుగా నిమీ ♦ లనముజెంద?

గీ॥ మత్సమాగమమునుగోరి ♦ మమతతోడఁ
గ్రూరమగుఁ జెరసాలలోఁ ♦ జేరి యకట
క్రొత్తగా సంగమముగొన్న ♦ కొమ్మకరణి
నలసియుంటివిగద జల ♦ జాక్షి యిపుడు॥

అనన్యసాధారణుఁడగు నీదీనునియందు నీయధికారము జూపు కొనుము. సంశయింపకుము,

(తరువాత నిరావతియు కౌముదికయుఁ బ్రవేశింతురు)

ఇరా—ఒసీ కౌముదికా! సముద్ర భవనములో గౌతము డొంటిగఁ బడుకొన్నాఁడని నీవు చంద్రికతోఁ జెప్పిపంపినది నిజమేనా?

కౌము—భట్టిని కబద్ధము చెప్పుదునా?

ఇరా—ప్రాణసంశయమునుండి విడిబడిన గౌతముని జూచుటకును నక్కడికే పోవుదము.

కౌము—భట్టినిమాట కొంచెతగానున్నదే? తక్కిన శేషపూరణము గూడ గావింపుము.

ఇరా—చిత్తరువులోనున్న భర్తను జూచుటకును. తెలిసినదా?

కౌము—అయితే ప్రత్యక్షముగా భర్తనేల వేడుకొనరాదు?

ఇరా—మూఢురాలా! చిత్రగతుఁడైనప్పుడెట్టివాఁడో పరస్త్రీప్రియం దనురక్తుఁడైనప్పుడును నట్టివాఁడేగదా. ముఖ్యముగా నా రావటము భర్తను వేడుకొనుటకే.

కౌము—భట్టినీ! యిటుయిటు (ఇరువురు నడతురు)

కౌము—(చూచి) భట్టినీ! ఇదిగో పాతాళభవనము వాకిట వీధిలోని యెద్దులాగున గౌతముఁడు కూర్చొనియే నిద్రించుచున్నాఁడు.

ఇరా—పాపము విషవేగము తగ్గలేదు కాబోలు.

కౌము—ముఖము తేటగనేయున్నది. ధ్రువసిద్ధిగదా వెద్యుఁడు. అధైర్యమేల?

గౌతము—అమ్మా మాళవికా! (అని పలవరించును)

కౌము—వింటివిగదా! భట్టినీ ఏదిపలవరెసము. ఈ దుర్మార్గుఁడు పలుకునది. భోజనమాత్రప్రియుఁడగు నీకృతఘ్నుఁడు మీ యింటబుట్టి మీయింటఁబెరిగి యెప్పుడు లక్ష్మీప్రసాదరూపము

లగు కుసుమములతోఁ బొట్టనింపుకొనుచూ మాళవికనే పలవరించుచున్నాఁడే? ఓరీ! నీచుఁడా [ అని ఆశ్చర్యముతో జూచును]

గౌత—ఇరావతిని మించినదానవుగమ్మ.

గౌము—ఇది మహాపాపము. పామునకు భయపడు నీదుర్మార్గుని పామువలె వంకరగానున్న యీ కర్రతో స్తంభముచాటున నుండి దేహశుద్ధి గావింతునా యేమి? లేకున్న నికను దుడుకు మాటలాడును.

ఇరా—ఇంతఁదనిని యింటివాసముల లెక్కఁ బెట్టినట్లు మాయింటఁదిని మాకే యెసరుబెట్టుచుంటివిగా నీచుడా! ఓసీ వీనినిమర్దింపుము.

కౌము—నిన్ను పాముకరచుట మంచిదే. [కర్రతోఁ గొట్టును]

గౌత—[తటాలున లేచి] మహారాజా! రక్షింపుము రక్షింపుము. నామీఁద మరల బాముబడినది. అయ్యో యీపాడుపాము నన్ను పగబట్టినట్లున్నదే. చఁపునా యేమి? [ఏడ్చును]

రాజు—[పరుగునవచ్చి] భయపడకుము.

మాళ—(వెంటనేవచ్చి) నాథా! తొందరపడిపోకుము. పామని యంటున్నాఁడు.

ఇరా—అయ్యో భర్త గూడ నిక్కడవచ్చుచున్నాఁడే.

గౌత- [లేచి నవ్వగ] ఏమిది? కర్రయా? ఎవరుపడవేసిరి చెపుమా? దీని మొగలిముల్లు నాకుఁ గ్రుచ్చుకొనుటచే నిజముగా పామే పడెనుగదాయని భయపడితిని. అబ్బా ఎంతవణుకుబుట్టెను. ఈనాటికి నేనదృష్టవంతుఁడనే. ఎంతగండ మెంతగండము. మాయమ్మ యదృష్టవంతురాలే.

వకుళా- [పటాక్షేపముతో వచ్చి] దేవా! పోకుఁడు. వంకరగా పాము వలెనున్నది.

ఇరా- [రాజును సమీపించి] నిర్విఘ్నముగా మీ దివాసంకేతము జరిగినదా? [ఇరావతినిగాంచి యందరు భయపడుదురు]

రాజు—ప్రేయసీ! ఇదేమి క్రొత్తగా మాట్లాడెదవు?

ఇరా—(వినిపించుకొనక) ఓసీ! నీదూత్యధికారము సరిపోయెనా? (కోపముతోఁ జూచును.)

వకు—భట్టినీ! అనుగ్రహింపుము. ఇందు నాదోషములేదు. కప్ప కూతవినియా మేఘము వర్షించును? (మాళవిక భయము నటించును.)

గౌత—పోనిందు కల్లోలమెందులకు ఇప్పటికిగూడ నా కా పాడుపామే పొడకట్టుచున్నది. మీ కలకలమువలన మరల నాపాడుపాము వచ్చునేమో?

ఇరా—చాలు చాలు. నీచాతుర్యము. (కోపముతో జూచును.)

గౌత—తే. కారణంబించుకయు లేక ♦ కప్పుడైన
కోపముదయించె నేనీకుఁ ♦ గోమలాంగి
యిలను క్రూరగ్రహాకలుషి ♦ తేందుమండ
లయగునే రాత్రి పర్వంబు ♦ లందుగాక.

ఇరా—కారణములేని కోపము తగదని యార్యగౌతముఁడు బాగుగ నుడివెను. మా యదృష్ట మితరులజేరియుండ మఱియుఁ గోపించి పరిహాసాస్పదురాండ్రమగుదుమా?

రాజు—వేరుగా దలఁపకుము. నీకోప కారణ మేమో తెలియుట లేదు.

ఇరా—(కౌముదిక నుద్దేశించి) ఓసీ ముక్కుగోసి యద్దము చేతికీయఁ గల యార్యపుత్రునితోఁ బనియేమి? తమ పక్షపాతము స్పష్టమైనదని దేవికి విన్నవింతము రమ్ము. (అని కౌముదికతో నిష్క్రమించును.)

మాళ — (జనాంతికము వకుళావళికతో) సఖీ! దేవిని తలఁచిన నా గుండె జగులుచున్నది. ఈ యిరావతి మరల నేమి చేయించునో తెలియదు. పోవుదము రమ్ము.

(వకుళావళికతో నిష్క్రమించును.)

(తెఱలో) ఆశ్చర్య మాశ్చర్యము. దోహదము జేసి యయిదు రాత్రులు కాకమునుపే యీకాంచనాశోకము మొగ్గ వేసినది దేవిగారికీ శుభవార్త వినిపించెదను.

గౌత — అదిగో వింటివా? తోటకాపు పలుకులు మనమును వానివెంట దేవికడ కేగితిమా యామెకు గోపముగల్గుట కవకాశముండదు.

ఇరువురు నిష్క్రమింతురు.

ఇది చతుర్థాంకము.





# మాళవికానాటకము.



## పంచమాంకము.

(తరువాత కుబ్జ ప్రవేశించును. తోటవాకిలి)

కుబ్జ—నేను బంగారపశోకచెట్టుకు పాదుదవ్వి చక్కంగా సిస్తుపోయేటట్టు కాలవకూడా చేసాను. మాళవికమ్మగారి అదురుష్టం యేమిటోగాని యీచెట్టు అప్పుడే పూసింది. కామట్టి యీసంగతిగనక అమ్మోరికి చెప్పించానా మాదానితోటి నెల జీతమే కాకుండా యింతో అంతో ముట్టచెప్పతుంది. ఇదివరకు మాళవికమ్మమీదవుండే కోపంకూడా పోతుందన్నమాటే. (పరిక్రమించిచూచి) అదుగో సారసకుండిక్కడికే వస్తున్నాడు. ఎక్కడికి పోతున్నాడో అడుగుతా.

(అంతట నొకపెట్టె బట్టుకొని సారసకుండు ప్రవేశించును.)

కుబ్జ—సారసకా! ఎక్కడికో పోతున్నావే? (పెట్టెజూచి) ఇదేంటికి.

సార—ఓహో నీవా? బాగున్నావా? యేదంసదివే బాపనయ్యలకే చంబావన యియ్యటానికే యీపెట్టెను చాత్తుర్లుగారింటికి తీస్కపోతుండా తెలిచిందా లేదా?

కుబ్జ—ఇప్పుడేం చంబావన.

సార—వోరోరితండ్రిగారే యెగ్గెం పెట్టారు. ఆయెగ్గెంలో గుఱ్ఱానిం వదిలారంట. దానెంటే చిన్నదొరను అంపి ఆయనకు జెయ్యం కల్గాలని రోజు రోజు యీపెట్టెడు రూపాయలు బాపనోరికిప్పించుతున్నారు.

కుబ్జ—ఇప్పుడమ్మోరెక్కడ ఉన్నది.

సార—ఇదభర్ దేసంనుంచి యీరసేనులోకుత్తరం రాశారంట దాన్ని చదివించుకొంటున్నది.

కుబ్జ—ఇదభర్ దొర చంగతేంటో తెలుసునా.

సార—యీరసేనుడు ఇంకా కొందరు ఇదబర్ దొరను పట్టుకొన్నారంట మాదవసేనయ్య ఖైదులోనుండి వచ్చాడంట.

కుబ్జ—సరేపో నేను పోవాలె.

(ఇరువురు నిష్క్రమింతురు. చతుర్థ పంచమాంకముల నడును నిది ప్రవేశకము.)

(తరువాత వృద్ధకంచుకి ప్రవేశించును. పురవీథి.)

కంచు—"ఆర్యపుత్రునితోడ కాంచనాశోకపాదపమును జూడఁగోరితినని మాలికతో చెప్పుమని దేవి నిపుణికవలన నాకు తెలిపినది. కాబట్టి ధర్మాసనమునను్న మహారాజుగారిని దర్శించెదను. (పరిక్రమించిచూచి) అదె జయధ్వనులు విని మహారాజిటె వచ్చుచున్నాడు. నేనెదురుగనుండక యీ మొగసాలకడ నుండెద. (అని యేకాంతమున నిలుచును.)

(తరువాత గౌతముఁడు నగ్నిమిత్రుఁడు ప్రవేశింతురు.)

రాజు—వయస్యా! ఇప్పటిస్థితిని జూడ నాహృదయము ఘనీభూతముగఁ దోఁచుచున్నది.

గౌత—అవును.

తే॥ కనయ దుర్లభమైన యా • కన్నెఁదలఁచి
బలముచే వశ్యుఁడగు విద • ర్భపతిని విని
ధారచే నాతపమున హా • తమగుఁ దప్పు
బోలె దుఃఖమ్ము సుఖమును • బొందెదీవు.

ఇంచుక యోర్చుకొంటివా? ప్రత్యేకము సుఖమే కలుగును.

రాజు—అదెట్లు? నాకీజన్మములో నంతటిపుణ్యము గలుగునా?

గౌత—"దేవీ! నీవు బాగుగ నలంకరించు నేర్పుగలదాననని గర్వించుచుంటివి. అట్లైన యొకసారి మాళవికకు వివాహాలంకారము గావించిచూపుము" అని భగవతి దేవిగారి నడిగినది. కావున నెప్పటికైన నట్టి యదృష్టము సిద్ధించునా?

రాజు- కోపము విడిచి నాకోరిక తీర్చునను మాట దేవియందు తదీయ పూర్వచరిత్రలవలన నమ్మవచ్చును గాని నాభాగ్యమేమో.

కంచుకి- (ప్రవేశించి) దేవా! "తన నియోగమున భర్తగారిలోఁ గూడ గౌరవింపఁ గుతూహలపడుచున్నా"నని దేవిగారు విన్నవించుచున్నారు.

రాజు- దేవి యిపుడెక్కడ?

కంచు- తక్కిన రాణివాసముల యథావిధిగ సత్కరించి పంపి మాళవికయున్నగుఁ బరిజనముతోఁ బ్రమదవనమున కరిగిరి.

రాజు- ఆలాగుననా? ప్రమదవనమునకు మార్గము జూపుము.

కంచు- దేవ! ఇటు ఇటు. (ఇద్దరు నిష్క్రమింతురు.)

(తరువాత వివాహవేషముతో మాళవికయు, దేవియు)

(పరివ్రాజికయు వకుళావళికయు ప్రవేశింతురు.)

మాళ-(స్వగతము) ఈ నా వివాహాలంకారమునకుఁ గారణ మెఱుఁగనుకాని నాహృదయమాత్రము తామరాకుమీది నీటిబొట్టువలెఁ దల్లడిల్లుచున్నది. పలుమారు నా యెడమకన్నేల నదరుచున్నదే? ఇది శుభసూచకముగదా? (విచారముతో) నాకెక్కడి శుభము. అట్టి ఐశ్వర్యము ననుభవించిన నాకు యుక్తాయుక్తవివేకము లేక యిట్టి నీచదశఁ గల్గించిన యావిధి శుభముగూడఁ గల్గించునా! నాకెక్కడిశుభము. ఎక్కడి భాగ్యము. ఎక్కడి లోకము.

(తరువాత రాజును గౌతముఁడును ప్రవేశింతురు.)

గౌత- (చూచి) వయస్యా! చూచితివా? ఈ ప్రమదవనలక్ష్మిని గాంచి వసంతుఁడు వయసు ముదిరినట్లున్నాఁడు?

తే॥ ప్రౌఢకురవకకుసుమము ♦ రందపాన
వశమునకా మేనుమరచి ష ♦ ట్పదచయంబు
బండిగురివెందతీవెచ ♦ ప్పరములందు
ఘుంకృతులొనర్చుం గాంచుమా ♦ సంతసమున.

నీయదృష్టము ఫలించునట్లే యున్నది. కాదేని నీకుఁగలనేని కనుబడనీయని మాళవికను నీవు సమీపించినను దేవి యూరకొనునా ?

(రాజును జూచి అందరును లేతురు.)

రాజు- గౌతమా ! చూచితివా !

గౌత- ఆ. చూచితిని గాని “ మాళవికా మాళవికా ” యని కలవరించుచుందువే ? అదిగో మాళవిక. నీయిష్టమువచ్చినంతసేపు చూడుము.

రాజు—ఇపుడిట్టి యవకాశము గలిగినందుల కెంతయుఁ గృతార్థుఁడనే.

ధారి- [రాజును గాంచి] ఆర్యపుత్రునకు జయమగుగాక.

పరి- దేవ ! జయమగుగాక.

రాజు- భగవతీ ! నమస్కరించెదను.

పరి- ఇష్టార్థసిద్ధిరస్తు.

ధారి- (పరిహాసముగా) తరుణీజనసహాయులగు నార్యపుత్రునకీకాంచనాశోకచ్ఛాయను సంకేతాలయముగఁ జేసితిమి.

రాజు—[గౌతముని జూచును.]

గౌత—మహారాజా ! నీయదృష్టము ఫలించినట్లే యని చెప్పితినిగదా!

రాజు—బ్రాహ్మణవాక్య మమోఘము. [అని యశోకముకడకు బోవును.]

గౌత—[జనాంతికము] వయస్యా ! నీవీక నిర్భయముగా నీయౌవనవతి ననుభవింపవచ్చును.

[అందరును కూర్చుందురు.]

రాజు—[స్వగతము] ఆహా కష్టముగదా యీసన్నిధివియోగము.

క॥ ఏనలరుదుఁ గోకముగతి
నీనాయిక కోకిరీతి ♦ నెసఁగెడి నిట మా
పూనిన యీకలయిక చెడ
గా నిశవలె దేవి యిపుడు ♦ కన్పట్టఁబడియెన్.

కంచు-(ప్రవేశించి) మహారాజా! జయము జయము. దేవరదర్శనము నకై యెవరో తీర్థయాత్రాపరుఁడు వేంచియున్నాఁడు.

రాజు—(స్వగతము) ఇట్టి సమయమున తైర్థికదర్శనమా? కాని మ్ము. విషయమేమో. (ప్రకాశము.) సత్వరము ప్రవేశింపఁ జేయుము.

కంచు—(నిష్క్రమించును.)

తైర్థి—(ప్రవేశించి) మహారాజా! జయము జయము.

రాజు—(లేచి) నమస్కారము. మహాత్మా! ఇఁట గూర్చుండుఁడు.

తైర్థి—(కూర్చొనును.)

రాజు—అయ్యా! తమ నివాసమెక్కడ. మీరు రావటమువలన మా జన్మము సార్థకమైనది నేను ధన్యుడను.

తైర్థి- (వినుపించుకొనక మాళవికనుజూచి అలోచించి) ఏమీ? ఈమె మాళవిక యగునా? అట్టి దుస్థికిఁ జిక్కిన యాబాల యిక్కడికెట్లువచ్చియుండును. అడిగి తెలిసికొందునా కాదేమో మాళవికయనియే యనుమానము గలుగుచున్నది. ధైర్య ముచేసెద (ప్రకాశము) అయ్యా!

మాళ- (తైర్థికునిజూచి కన్నీరు విడుచును.)

తైర్థి- అయ్యా! ఈసుమంగలి మాళవికయా? నిజమా?

(అందరు నాశ్చర్యముతో జూచుచుందురు.)

రాజు.- అయ్యా! మీరెవరు (మాళవికనుజూపి) ఈ చెలి యెవ్వత మీకెట్లు తెలియును.

త్రైధి- ఓహో తెలియదా? ఈమె మారాజుగారి ముద్దుకూతురు.

రాజు- ఏమీ అదెట్లు చెప్పుము. మీరాజెవరు?

త్రైధి- దేవ! అవధరింపుము. విదర్భాధిపతి మాధవసేనునకీమె తోబుట్టువు.

ధారి- అయ్యో ఈమె రాచబిడ్డయా? తలలోఁ బెట్టుకొనఁదగిన రత్నమును గాలఁ దన్నితినే? ఎంతప్రమాదము.

రాజు- (త్రైధిక్షుని గాంచి) ఈ చెలి యిట్లగుటకుఁ గారణమేమి.

త్రైధి- రాజకుమారుఁడు మాధవసేనుఁడు దాయాదులచేతఁ బట్టుబడ మావంటి మంత్రులవిడచి యమాత్యశేఖరుఁడు సుమతి మాళవికను తీసుకొని తన సోదరి వెంటరా వెడలిపోయెను.

రాజు- తరువాత.

త్రైధి- తరువాత వారిజాడ తెలియక దేశముల వెదకుచు నిచ్చటికిఁ జేరి మాయువరాజుసోదరిని గాంచు భాగ్యము గంటిని.

పరి- దేవ! తరువాత జరిగినదానిని యీమందభాగ్య చెప్పుటకు సాహసించుచున్నది.

త్రైధి- (స్వగత) ఈమె పూజ్యురాలగు కౌశికవలె నున్నదే. అవును ఆమెయే. (ప్రకాశము) అమ్మా! యతివేషముతో నుంటచే నెంటనే కనుగొననేరకుంటిని భగవతీ! నమస్కరించెద.

పరి- ఆర్యవసంతా! శుభమగుఁగాక.

రాజు- (కౌశికనుద్దేశించి) భగవతీ! వీరు నీకాప్తులా? తరువాత జరిగిన దానిని వినుపింపుము.

కౌశి - మాధవసేనుఁడట్లు కష్టదశపాలగుడు చేయునదిలేక మాయన్న యగు సుమతి యువరాజు తలంపు కొనసాగింపఁగోరి నేను వెంటరా మాళవికను తీసికొని విదిశానగర మార్గమునవచ్చుచు నొకబాటసారుల బిడారును గలసికొనెను.

రాజు - బాగుగనున్నది తరువాత.

కౌశి - ఆ యఖండమగు బిడారు మార్గాయాసము బోగొట్టుకొనుటకై యింకొక పెద్ద మఱ్ఱినీడ విడిసెను.

రాజు - (స్వగ) ఇంతవఱకమంగళమగుపలుకు విన లేను. (ప్రకాశము) తరువాత.

కౌశి - తరువాత.

తే. ఎదపయిఁ గొన్ని యంబుల ♦ పొదులు వ్రేల
నెమలికన్నులు పాన్పిఁగాభా ♦ గమున గ్రాల
సింగిణులదాల్చి యెదురుకొ ♦ నంగరాని
చోరవర్గంబుదాకె బి ♦ డారునపుడు.

రాజు - ఎంతప్రమాద మెంతప్రమాదము తరువాత.

కౌశి - తరువాత నయ్యురువాగును ఘోరముగ బోరుసల్పెను. అప్పుడు నిరాయుధుండైనను స్వభావ శూరుండగు సుమతి యాపాటచ్చరులనెల్ల నొక్కొక్కరి యమపురి కనిపెను. (హీనస్వర యగును.)

రాజు - ఇకమీఁద గష్టమగుదానిని వినవలసి యుండునేమో ?

గౌత - తరువాత జరిగినదానినిగూడ వినిపింపుము తల్లీ !

కౌశి - తరువాతఁ దసపక్షమెల్ల నశించుటెఱిఁగి తస్కరాగ్రేసరుండగు నాజానుబాహుఁ డొకఁడు సుమతి నెదిర్కొనెను. వానితోఁ జాలసేపుపోరి సుమతి

ఉ. స్వామి హితానువర్తియగు ♦ సాధువతండు భయంకరోరు సం
గ్రామమునందు జేరి యుడు ♦ రాజ నిభాననని మెం బ్రోవఁగా
నీమముదాల్చి యప్పురమ ♦ ణీయా కలావృతమైన దేహమున్
భూమిపయిన్ద్యజించి యశ ♦ మ్మున్ జిరముండఁగ జేసె నక్కటా.

(అని రోదనము జేయును.)

వసం——

మ॥ తనకున్ స్వామిహితంబె ముఖ్యమగు గ ♦ ర్తవ్యంబుగా వైరిగో
త్రనిరోధంబాచరింప నేరిచి విద ♦ ర్భస్వామికిన్ మేలుగో
రిన వంద్యుండెవడట్టి ధీరుఁడవు ధా ♦ త్రీనాథ సేవ్యుండవై
యనఘా; చోరులచేతఁ జిక్కుబడి రం ♦ భాశ్లేషమున్ గాంచితే?

(మాళవిక అధోముఖియై కన్నీరునించును.)

రాజు——దేహధారులగు నెల్లవారికి లోకయాత్ర సహజము. స్వామి ఋణముఁదీర్చిన యామహాత్మునికై విచారింపకుము. అతఁడు ప్రశంసనీయుఁడు.

కౌశి——అంతట నేను మూర్ఛనొంది లేఁచువరకు మాళవిక కాన రాదయ్యెను.

రాజు——[స్వగతము] పాపమీ లేమకు మించిన కష్టముగూర్చినందులకు విధాత పక్షపాతియనవచ్చును.

కౌశి——తరువాత సుమతికి యథావిధి నగ్నిసంస్కారము గావించి యసహ్యమగు దుఃఖమునకోర్వలేక కాషాయాంబరముల దాల్చి యీ దేశమున నెట్టులోఁగాలము గడుపుచుంటిని.

రాజు——వినిపాతములు పరిభవకారణములు భాగ్యము నిత్యముకాదు.

ధారి——ఈమెయుత్తమ కులీనయని తెలిసియుఁ జెప్పవైతి వేమి?

కౌశి——పాపము శమించుగాక కారణముండియే చెప్పనైతిని.

ధారి——ఎట్టిదా కారణము?

కౌశి—మాళవిక యొక సంవత్సరము దాస్యముచేసి తర్వాతఁదగిన భర్తనుగూడి సుఖంబుండఁగలదని యొకనాఁడు దైవజ్ఞులు చెప్పుటవలన నట్టిదాస్యము చేయించుకొన నీవే తగుదువని యిటఁజేరి రోజులు లెక్కబెట్టుచుంటిని.

కంచు—(ప్రవేశించి) మహారాజా! జయము జయము ఇతరప్రసంగము వలన విస్మృతిగలిగిన యీవృత్తాంతమును మంత్రిగారు విన్న వించుచున్నారు. "విదర్భదేశమును గూర్చి చేయఁదగిన పరిస్థితులను మాబుద్ధికొలఁదిగ నాలోచించితిమి. ఈవిషయమై దేవరయాజ్ఞ యెట్లుండునో? అని

రాజు—జయసేనా! ఈవిషయమిదివఱకే యమాత్యులకడకుఁ బంపఁదలఁచి వ్రాసియుంచితిని. (అనియొక లేఖని నొసంగును.)

కంచు—చిత్తము. (నిష్క్రమించును.)

వసం—(మాళవికనుజూచి) అమ్మా! అదృష్టవశమున భర్తృదారకుండధర్మరాజ్యాధిపతి కాఁగలిగినందులకు నాకెంతయు సంతోషము.

మాళ—(స్వగతము) ప్రాణసంశయమునుండి తప్పినందులకే నాకు సంతోషము.

కంచు—(ప్రవేశించి) దేవ! దేవరబుద్ధి యొకలుసితమగుటవలన నమాత్యపరిషత్తుగూడ నట్లె నిర్ధారణము జేసినదని మంత్రి గారు విన్నవించుచున్నారు. ఎట్లన

తే॥ ఇరుదెఱంగుల విభజించి ♦ యిచ్చినట్టి
రాజ్యముల నేలుకొనుచుఁ బ ♦ రస్పరంబు
కలహములమాని రథతురం ♦ గములకరణి
సమముగానుంద్రు నీ నిదే ♦ శంబుకతన.

మఱియు నొకవిన్నపము సేనాపతియగు పుష్పమిత్రులవారి యొద్దనుండి యుత్తరీయము లేఖయువచ్చినది. (అని చంకలో నున్నయుత్తరీయము లేఖయు నొసంగును.)

ధారి—ఆ పూజ్యగురుజనాజ్ఞ యేమనియున్నదో ?

రాజు—[ఉత్తరమువిప్పి చదువుచున్నాఁడు.] స్వస్తియజ్ఞవాటమునుండి సేనాపతి పుష్పమిత్రుఁ డాయుష్మంతుఁడగు కుమారునగ్నిమిత్రుని బ్రేమచేగౌఁగలించుకొని యాజ్ఞాపించునది. నేనుయజ్ఞదీక్షితుఁడనై నూర్వుర రాజకుమారుల దోడిచ్చి సంవత్సరాంతమునకు మరలి వచ్చునట్లు యజ్ఞాశ్వమునువిడిచి దానిని రక్షింప వసుమిత్రుని నియోగించితిని. ఆతురంగము సింధునదమునకు దక్షిణతీరమునఁ దిరుగుచు యవనులదాడి చేపట్టుకొనఁబడినది. అంతనయ్యిరుపక్షములకుఁ గొప్పసంగ్రామము జరిగెను.

ధారి—విచారమును జూపును.

రాజు—ఔరా! యవనులయుద్రేకము(తక్కినదానిని చదువుచున్నాఁడు)

క॥ అంత వసుమిత్రుఁడు పరా
క్రాంతంబగు వాజిఁబ్రోవ ♦ గా నెంచి ధను
ష్మంతుఁడై రిపుసేనను
నెంతయునోడించి వాజి ♦ నిటకుఁదెచ్చెన్.

ధారి—ఈ శుభవార్తవలన నామనసు కుదుటఁబడినది.

గౌత—కుమారా! తండ్రిపేరునిల్పితివి.

రాజు—(మిగిలినదానిని జదువుచున్నాఁడు.)

అంశుమంతుఁడు సగరునకుఁబోలెఁ బౌత్రుఁడగు వసుమిత్రుఁ డశ్వము నర్పింపఁ గుతూహలమున యజింపుచుంటిని. కావున వేరుతలంపక రాణివాసములతోఁగూడ జన్నముసేవింప రాఁదగును.

ధారి.—గురుజనాజ్ఞ యనుల్లంఘ్యము.

కౌశి—దైవయోగమునఁ బుత్రవిజయముఁజేసి దంపతులు కృతార్థులయిరి. (ధారిణినిగాంచి)

గీ॥ వీరపత్నులైన ♦ సారసాక్షులమూర్ధన్య
మందునిల్పె భర్త ♦ యతివ! నిన్ను
ఇపుడు కొడుకు కతన ♦ నెంతేనియును నీవు
వీరమాతయనఁగ ♦ వెలసితమ్మ.

రాజు—గౌతమా! గున్న యేనుఁగు యూధపతి ననుకరించినది.

గౌత—

ఆ॥ వె॥ ఔర్వునకు బడబానల ♦ మటుల యోధుఁ
డవగు నీకుదయించిన ♦ యట్టి సుతుని
వీరచేష్టితమున కొక్క ♦ వీసమైన
వింతగల్గదుమాకుఁ బృ ♦ థ్వీకళత్ర.

ధారి—(స్వగత) కాంచనాశోకమునకు దోహదమొనర్పు నియోగించు నపుడు మాళవికకు నేఁజేసిన వాగ్దానమిట్టి సంతోషసమయమునఁ దీర్చుటయే మంచిది. (కౌశికనుగాంచి) భగవతీ! పూజ్యులగు మీయన్నగారు మున్నుగ సంకల్పించుకొనిన దానిని నీయిచ్చపోవ్వున నాచరింపుము.

కౌశి—దేవీ! నీవే యీమెకు మేలుగోరుదానవు.

ధారి—(మాళవిక చేయిపట్టుకొని) పుత్రవిజయవార్తచేత సంతోషమును గల్గించినందుల కార్యపుత్రునకు మాసమర్పించు కానిక యీమెదక్క వేరొఁడు లేదని విన్నవించెదను. (అని మాళవిక చేయి రాజుచేతిలో బెట్టఁబోవును.)

రాజు—(లజ్జతో నూరకొనును.)

గౌత—దేవీ! ప్రతివారికిని నూతనముగా పాణిగ్రహణము జేయునపుడు
లజ్జగలుగుట లోకాచారమే కదా ?

రాజు—(గౌతమునిజూచును.)

గౌత—అదియునుగాక అనురాగముతో దేవీ శబ్దపూర్వకముగ నర్పించిన మాళవిక నేలిక గ్రహించునేమో? నాయభిప్రాయమిది.

ధారి—రాజకన్యయగు నీమెకు జన్మముతోడనే దేవీ శబ్దము కలుగ మరలఁ జేర్చుట పునరుక్తిగదాయని శంకించితిని.

కౌశి—అట్లుగాదు.

తే. ఆకరంబున నుదయించి ♦ నట్టిదైన
నుచిత సంస్కారణము లేక ♦ యుజ్జ్వలెటుల
రత్నసంతతికి సువర్ణ ♦ రాజితోడ
సంగమముగల్గనేర్చు ల ♦ తాంగి చెపుమా ?

ధారి—దేవ ! క్షమింపుము. అభ్యుదయ ప్రసంగమువలన విస్మృతి గల్గెను. (వకుళావళికనుగాంచి) వకుళావళికా! నీవేగి మేలిమునుఁగు గొని రమ్ము.

వకు—చిత్తము. (నిష్క్రమించి ప్రవేశించి) దేవీ ! ఇదిగో మేలిమునుఁగు. (అని యిచ్చును.)

ధారి—(మాళవిక కలంకరించి) ఆర్యపుత్రుడిక మాళవికను కనికరించుచుగాక. (అని) ప్రమాదము. ప్రమాదను. మాళవికాదేవిని

రాజు—దేవి నియోగము మీఱరానిదిగదా (అని మాళవిక చేయి బట్టుకొనును.) (మాళవిక లజ్జ నభినయించును.)

గౌత—భట్టినీ ! దీర్ఘసుమంగలివికమ్ము.

కౌశి—(ధారిణినిగాంచి) దేవీ ! ఇది నీయందాశ్చర్యముగాదు.

తే. పతులయెడ భక్తిగలిగిన ♦ సతులు సతము
ధర సపత్నితోనైనను ♦ వరుఁగొల్తు

రితరనదుల జలంబుల ♦ నెల్లను దమ
పతినిజేర్చు సముద్రంబు బారునదులు.

దేవా! ఈ యుచిత సంబంధమువలనఁ గృతార్థుఁడగు మాధవ సేనుని గౌరవించి వత్తునా? (లేవబోవును.)

ధారి—భగవతీ! నీవొంటిగ బోవుటుచితముగాదు.

కౌశి—మాయిరువుర బాంధవ్యము గొప్పదికదా?

ధారి—ఆర్యపుత్రునికింక నేనేమి మేలుచేయుదానను.

రాజు—ఇంతకన్న నా కెక్కువమేలేమి యుండును. అయిన నిట్లగుఁగాక!

భరతవాక్యము.

చ॥ అనిశము నీవు నాయెడ ద ♦ యామతివై చరియింతుగాతఁ బా
వనియగు భూతధాత్రి సుల ♦ భంబుగ సస్యమొసంగుఁగాత భూ
జనమున కీతిబాధ లుప ♦ శాంతిని జెందెడుగాత నగ్నిమి
త్రుని పరిపాలనంబునఁ గు ♦ తూహలమందెడుగాత యెల్లరున్.

అందరు—తథాస్తు. తథాస్తు.

(నిష్క్రమింతురు.)

గద్యము.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ ♦ వేమనారాధ్యవం
శాంబోధపూర్ణశ ♦ శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి ♦ కెనయై బుధుల్ మెచ్చ
మహిని బాతివ్రత్య ♦ మహిమఁగాంచె

నట్టి నందయుక గా ♦ రమకు ద్వితీయపు
త్రుండ గాండివ్యగో ♦ త్రుండ దక్షి
ణామూర్తికిని శివా ♦ నందునకును సోద
రుండఁ గూరిమి యగ్ర ♦ జుండ సుబ్బ

తే॥ నార్యునకుఁ బౌత్రుఁడను మదీ ♦ యముగునట్టి
మాళవిక యను నాటక ♦ మాళియందు
నరయఁగా సకలము బంచ ♦ మాంకమయ్యె
సతము రక్షించు దీనిని ♦ జంద్రమాళి.

సమాప్తము.



# సీమంతిని.

## (సోమవార వ్రతమాహాత్మ్యము) అచ్చులోనున్నది.

ఇది వ్యాసమహర్షి విరచితమగు బ్రహ్మోత్తరఖండములోని సీమంతినీ చరిత్రము. ఇందు వ్రతనిష్ఠగలవారికి సాధింపరానిది లేదని నిరూపింపఁబడినది. సీమంతినీదేవి యాచరించు సోమవార వ్రతమాహాత్మ్యము బాగుగా వర్ణింపఁబడినది. సీమంతినిని వ్రతభ్రష్టురాలుగఁ జేయుటకై మైత్రేయుఁ డాచరించు మహాకార్యములు వర్ణనాతీతములు. మైత్రేయునిచేఁ బంపఁబడిన సుమేధసోమవంతుల సంభాషణము. సోమవంతుఁడు సుమేధునకు శ్రోత్రియాచారమును దెలుపుట. సుమేధుఁడు తన యుపాయశక్తిచే సోమవంతుని కృత్రిమాంగనా రూపముదాల్ప సమ్మతింపఁజేయుట. సీమంతినీదేవివలనఁ బూజింపఁబడిన సుమేధ సోమవంతులలో సోమవంతుఁడు స్త్రీయై విరహావస్థనొందుట చంద్రాంగదుఁడు పాతాళలోకమునఁ దక్షకునకు వేదాంతము నెఱింగించుట. తక్షకుఁడు చంద్రాంగదుని జంపఁబోవుట. మైత్రేయుఁడు సీమంతినితో ననేకవిధముల వ్రతపరిత్యాగము జేయుమని చెప్పుట మొదలగు ప్రకరణములన్నియుఁ జక్కఁగ వ్రాయఁబడినవి.

శా॥ ఛీ యీలాగునఁబల్క నీకు మదిలో ♦ సిగ్గేలలేదయ్యొ నా
నా రొండేని యనిత్యమాతనుపై ♦ భ్రాంతిన్ విడఁజాలక యు
క్తాయుక్తంబు లెఱుంగకే దిరుగ గ ♦ న్యాల్ స్థైర్యమున్ బూని యిం
తో యాయాసకరంబులౌ వ్రతములం ♦ దున్ నిల్వఁగాఁగంటిమే॥

చ॥ దిరిసెనఁపుం బ్రసూనము గ ♦ తిన్ మృదువై తగు మేనమేల్మిఁ బం
గరు వలువన్ ధరించి యొక ♦ కంటఁ గృపా మకరందబిందువుల్
గురియుచు నొక్కకంట రిపు ♦ కుంజరగర్వ వినాశసింహతా
స్ఫురణము జాటు నీవృపతిఁ ♦ జూడఁగఁ గన్నులు రెండుచాలునే॥

మ॥ ఎపుడో యెవ్వనిచేతనో యెటులనో ♦ యేరీతినో జూచుచు
న్నపుడే యంగడినున్న మాంసముటుల ♦ న్యాయంబుగాఁ బ్రాణముల్
విపులంబైన శరీరమున్ విడుచు నీ ♦ లీలన్ గదా లోకమె
ల్లపుడున్ బుట్టుచుఁ జచ్చుచుంట నిఁక నే ♦ లా నాకు దుఃఖించుటల్॥

ఇట్టి యున్నతమగు నాటక మాంధ్రభాషయం దింతవఱకుఁ బ్రకటింపఁబడలేదని చెప్పుట యతిశయముగాదు. ఇందు లాక్షణికుల లక్షణము ముఖ్యముగా ననుసరింపఁబడినది.

చందాదారులకు రు. 1-0-0. ఇతరులకు రు 1-4-0.